ఏనుగుల రాయి (కథ)

సి. రామచంద్రరావు



ఆంధ్రసచిత్ర వారపత్రిక

24-6-'59

25 నయాపైసలు

ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY



ఎంకికోసం

చిత్రకారుడు : వెల్లటూరి పూర్ణానందశర్మ

సంవత్సర చందా
రు. 13—0—0
విడిప్రతిక 25 న.పై

Founder : K. NAGESWARA RAO

వికారి వైశాఖ బహుళ చతుర్థి బుధవారం

సంపుటము 59
సంచిక 38
24-6 59

# విషయానుక్రమణిక

ముఖచిత్రం :

భారతీవారి 'బభ్రువాహన' చిత్రంలో

ఎస్. వరలక్ష్మి.







# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## రాజధానిలో రామారావు

'ఎన్. టీ.' కి టీ ఏర్పాటు చేయబడింది గతశనివారం రిట్జ్ హోటల్లో. ఆ సాయంత్రం టీ కప్పులో తుఫాను చెలరేగింది వై. యం. సీ. ఏ. లో. ఎలుక్కి ప్రాణసంకటం తెచ్చే చెలగాటం మళ్ళీ ప్రకటించింది పిల్లి ఈ వారంలో. పాఠక మహాశయా! ఎలక కావలాదారు కళ్ళల్లో కారంకొట్టి, జైలునుంచి పారిపోయింది షాబాదులో. 'పునర్జన్మించిన' కుంభకర్ణుడు కన్నులో సగం తెరచి చూస్తున్నాడు.

ఇవీ ఈవారం చెప్పే కబుర్లు. రాజధాని నగరంలో మొన్న మొన్నటివరకు ఎండలు మాడ్చిపోయాయి. ఎండలకు దేశంలో చెరువులు, సరస్సులు ఇంకిపోయినట్లే; నగలు చిక్కిపోయాయి ఎండలకు వార్తలు ఇంకిపోయాయి కాని చిక్కటల్లేదు వార్తలెలా హరించాలో తెలియక, 'వార్తాహరు'లందరూ సతమతమౌతున్నారు. 'పాఠక మహాశయా! కబుర్లు ఎలా చెప్పటం ఈవారం?' అని తల పట్టుకు కూచున్న నాతో—ఎలుక్కి ప్రాణ సంకటం తెచ్చే చెలగాటం ప్రారంభిస్తున్నాను అని చెప్పింది మా ఫెంసు మార్జాలం.

* * *

### ఉద్యోగులు..ఉద్యోగాలు

పండిట్జీ ఒకసారి ఎర్రకోట బురుజుపై నిలబడి, పొదుపు చేయవలసిన అవసరంగూర్చి ఒక పెద్ద ఉపన్యాస మిచ్చాడు. 'సౌకర్యాలకు అడ్డురాకుండా పొదుపు చేయడం ఎలా?' అని ఆలోచించ సాగాయి దేశంలోఉన్న ప్రభుత్వాలు. తుదకు పొదుపు సంఘాలు నియమించి, పొదుపు కార్యక్రమాలు ప్రారంభించాయి.

ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో విపరీతమైన కరువు ఏర్పడింది కాగితాలకి. ప్రభుత్వం పొదుపుచేయాలని నిశ్చయించింది. ఈ కార్యక్రమాన్ని పరిహసిస్తూ, శ్రీ మాచిరాజు దేవీప్రసాద్ కొన్ని పద్యాలు వ్రాశారు. కాగితాల పొదుపు చేయించడానికి, ప్రభుత్వం ఒక ప్రత్యేకాధికారిని నియమించిందట. "కాగితపు కర్వనేటి వంకాయకతను – బరువు వంటింటి గోక టిబండగాడు" అన్నారు శ్రీ దేవీప్రసాద్. 'కాగితాలు పొదుపుచేయండి, చేయండి' అంటూ కోటకోలది పోస్టర్లు ముద్రింపించి గోడలమీద అతికించాడట అధికారి. ప్రభుత్వం తలపెట్టే పొదుపు కార్యక్రమాలన్నీ ఈవిధంగానే ఉంటాయి.

చిన్న మొత్తాలపొదుపు ఉద్యమం ప్రారంభించింది కేంద్రం. ఈఉద్యమాన్ని ప్రోత్సహించాలని సంవత్సరం క్రిందట మంత్రులందరూ భారీ పర్యటన కార్యక్రమం వేసుకొని బయలుదేరారు. మంత్రులు బయలుదేరితే, ఎంత ఖర్చవుతుందో మనందరికీ తెలుసు. పొదుపు ఉద్యమ నిర్వహణకు ఎన్నిలక్షలు వ్యయమయ్యాయో, ఎన్నికోట్ల రూపాయల పొదుపు సాధించారో ప్రభుత్వం ప్రకటిస్తే తమాషాగా ఉంటుంది.

భవనాల ప్రధాన ఇంజనీరు కార్యాలయంలో కొంతమందిని, ఇండియన్ మెడిసిన్ ప్రత్యేకాధికారి కార్యాలయంలో మరికొంతమందిని తొలగించి, ఏడాదికి లక్షాపాతిక వేల రూపాయల పొదుపు సాధించనున్నది రాష్ట్రప్రభుత్వం. "కొద్దిమందినే తొలగిస్తున్నాం కనక, వాళ్ళని ఇతర శాఖల్లోకి తీసుకోవచ్చు" అన్నారు ప్రభుత్వ ప్రతినిధి ఒకరు ఈ శనివారం. ఇతర శాఖల్లోకి తీసుకుంటే పొదుపు ఎలా ఔతుంది? జీతాలు తగ్గించి తీసుకుంటే, లక్షాపాతిక వేల పొదుపు ఎలా ఔతుంది? నిజంగా పొదుపు చేయాలనే ఉద్దేశ్యం ప్రభుత్వానికుంటే, ఆ ఉద్యోగుల బ్రతుకు తెరువు సంగతేమిటి?

ప్రభుత్వపు పొదుపు ఉద్యమ చెలగాటం ఉద్యోగుల ప్రాణసంకటానికి వచ్చింది!

### దొంగడు లింగడు పరార్!

రెండుమూడు రూపాయల వెండి నగలకోసం, నిండుప్రాణాలు తీసిన లింగడు విషయం రాజధాని కబుర్లలో ప్రస్తావించాను ఇదివరలో. పది మందిని పొట్ట నెట్టుకున్నాడతను. ఈ వారం అతడు షాబాద్ పోలీస్ స్టేషన్‌నుంచి పారిపోయాడని తెలియవచ్చింది.

ఒకరు కాదు, ఇద్దరు కాదు – పదిమందిని చంపాడట లింగడు. అతడు జాంబాగ్ లో భాగమ్మ అనే నడివయస్కురాలిని హత్య చేసిన ఇరవై నాలుగు గంటల్లో నగరమంతా గాలించి పట్టుకొన్నారు నగరపోలీసు దళం వారు.

# ★ రాజధాని కబుర్లు ★

లింగడుచేసిన హత్యలన్నీ దాదాపు హైదరాబాదు, మహబూబ్‌నగర్, నల్గొండ జిల్లాల్లో జరిగాయి. కొన్ని హత్యలకి సంబంధించిన అన్వేషణకోరకే, లింగడిని షాబాద్ కొనిపోయారట హైదరాబాద్ జిల్లా పోలీసుదళం వారు.

షాబాద్ పోలీస్ స్టేషన్‌కి 'లాకప్' ఏర్పాటులేదని తెలుస్తూంది. లింగడు ఆ పోలీస్ స్టేషన్‌లో ఇద్దరు పోలీసు జవానుల అధీనంలో ఉంచబడ్డాడు. జూన్ 4 వ తేదీ రాత్రిగాని, 6 వ తేదీ రాత్రిగాని లింగడు జవానుల కళ్ళల్లో కారంకొట్టి పారిపోయాడని సమాచారం చేరింది.

బోనులోనుంచి తప్పించుకున్న ఎలక మళ్ళీ దొరుకుతుందా? ఎలకను మభ్యపెట్టి బోనులో పెడతాం? కాపలాదారులను మభ్యపెట్టి బయటకు రాగలవు కాబోలు ఎలకలు!.

* * *

జంటనగరాలలోని విద్యాసంస్థలనిధులు దుర్వినియోగం ఔతున్నాయనడానికి తగిన సాక్ష్యాలు నగరపోలీసుశాఖవద్ద ఉన్నాయని తెలిసింది. ఇంటి దొంగల్ని పట్టడానికి ఈశ్వరుడికైనా తరంకాదట. ఈశ్వరుడికంటె ఒక ఆకు ఎక్కువ చదువుకుంది మన పోలీసుశాఖ.

ఆంధ్రదేశంలో విద్యాసంస్థల ధనాలను దుర్వినియోగంచేసే 'సంఘపెద్దలు' మనకు తెలుసు. కళాశాలకొక భవనం వేస్తే కమిటీ కార్యదర్శిగారి మేడమీద ఒక అంతస్తు లేవటం ఆంధ్రదేశంలో పరిపాటే! ఈ వ్యాధి ఇప్పుడు రాజధానినగరానికికూడా వ్యాపించినట్లుంది.

గత నెలలో శ్రీ హనుమంత్ నాయుడు అన్వర్యాన నగరపోలీసు క్రైమ్‌శాఖ ముగ్గురు వ్యక్తుల్ని అరెస్టు చేసింది. ముగ్గురులో ఒకరు ఉన్నత పాఠశాల ప్రధానాధ్యాపకుడు ఇరువురు అకౌంటెంట్లు. బయటపడ్డ మూడు, పాఠశాలల్లో మొత్తం పదిహేను వేలదాకా కార్యకర్తల ఇంటిదారి, బేంకుదారి పట్టినట్టు తెలుస్తూంది.

## సిటీకివచ్చిన ఎన్. టీ.కి టీ

"ఎన్. టీ. పెర్సనాల్టీ చూసి మేం ముగ్ధులమయ్యాం. సిటీనిచూసి ఎన్. టీ. ముగ్ధులయ్యారనే ఆశిస్తున్నాం" అన్నారు హైద్రాబాదు చలనచిత్ర ప్రదర్శకుల సంఘం అధ్యక్షులు శ్రీ మహ్మదలీ కర్మాలీ గత శనివారం సాయంత్రం. సందర్భం సిటీకి మొదటిసారిగా వచ్చిన ఎన్. టీ. కి. టీ ఇచ్చారు రిట్జ్ హోటల్లో గత శనివారం శ్రీ నేషనల్ ఆర్టు పిక్చర్సువారు. అధ్యక్షత వహించారు శ్రీ కర్మాలీ.

ఎందరో మహానుభావులు హాజరయ్యారు తేనీటి విందుకి (అందులో నేను ఉన్నాను). అందరితో కరచాలనంచేసి, వందనాలు చేశారుఎన్. టీ.. హాజరయిన మహానుభావుల్లో, నేను కాక, కుమ్మడి, ఆర్. నాగేశ్వరరావు, శలంగి, చలం, గిరిజ, కాంతారావు, రమణమూర్తి, కె. వి. ఎస్. శర్మ, ఆదినారాయణ రావు, కెమెరామేన్ కమల్ ఘోష్!, 'శుభాష్‌రాముడు' దర్శకుడు సి. ఎస్. రావు, ఫిలిం ఛాంబర్ కార్యదర్శులు శ్రీయుతులు చెలువరాజ్, చోప్రా ఉన్నారు.

నందమూరి తారక రామారావు రాజధాని పౌరులకి కొత్తకాదు. ఎన్నో సినిమాల్లో చూసేశాం ఆయన్ని. మేము కొత్తే ఆయనకి ఆయన ఎన్నడూ హైదరాబాదు రాలేదు. 'సిటీ బావుంది. వాతావరణం చాలా బావుంది,' అన్నారు.

(అప్పటికి ఎండలయిపోయాయి, వర్షాలింకా ప్రారంభం కాలేదు)

ఎన్. టీ ఇంతవరకు ఈ సిటీకి రాకపోవడమేమిటి? అదేమాట అడిగేశాను ఆయన్ని. "మా చిత్రాలు శతదినోత్సవాలు చేసుకున్నప్పుడు సాధారణంగా మదరాసు విడిచి వస్తాం. హైదరాబాదులో శతదినోత్సవం జరుపుకున్న తెలుగు చిత్రాలు తక్కువ" అన్నారు ఎన్టీ.

హిందీ సినీమాలువస్తే చిమల్లా క్యూలో, నిలబడి చూస్తారు హైదరాబాదు ప్రేక్షకులు. తెలుగు సినీమాలు అలా చూట్టంలేదంటే బలమైన కారణం ఉండుండాలి. ఆ కారణం ఏదైనా తొలగించడం ఎన్టీ వంటి వారి చేతుల్లోనే ఉండుంటుంది.

*　　*　　*

తేనీటి విందు ముగియగానే శ్రీ కేపవల్ ఆర్టు పిక్చర్సువారి పక్షాన కృతజ్ఞతలు తెలిపారు శ్రీ ప్రసాద్. మేం అంతా కరతాళ ధ్వనులు చేశాం. ఒక పట్టుపైన ఉంది రిట్జ్ హోటల్. 'ఎన్. టీ అండ్ కంపెనీ' కోసం ఎదురు చూస్తూ గేటుకడ్డంగా నిలబడ్డారు పేదా పాదా అంతా. తూలుతున్న ఎదుపు కారులో కూలబడి గేటువరకు చేరాను. కారాపేసి జనం లోపలికి పరకాయించి చూశారు. లోపల కూచున్నది నేను. నిట్టూర్చుస్తూ పక్కకు తొలగి కారును పోనిచ్చారు జనం.

## టీ కప్పులో తుఫాన్

రిట్జ్ హోటల్లో ఎన్. టీ. తో కలిసి మాకూ ఇచ్చిన టీ త్రాగి, తార(క) దర్శనార్థం వేచిఉన్న ప్రేక్షక సమూహందాటి వై. యం. సి. ఏ. చేరుకున్నాం. అక్కడికి చేరే సరికి, అక్కడ ముద్దుకృష్ణగారి టీ కప్పులో తుఫాన్ చెలరేగుతూంది. సురక్షితంగా కుర్చీలో కూర్చుని తుఫాన్ చూశాం.

ముద్దుకృష్ణగారు 'టీకప్పులో తుఫాను' ఎన్నడు రచించారో తెలియదు. వెనుక చూపేగాని ముందుచూపులేని ఆకాశవాణి కొన్ని సెలక్టిందట ఈ నాటకం ఎన్నుకొంది ప్రదర్శనకి. ఆ ప్రదర్శనలో పాల్గొన్న నటులే, వై. యం. సి. ఏ. ప్రదర్శనలోనూ పాల్గొన్నారు.

ఇతివృత్తంలో నవ్యత లేదు. నవ్యతని ఆశించడంకూడా పొరపాటే. చివర పది హేను నిముషాలు అనవసరంగా నడిచింది కథ. బహుశః నేను నాటకరచనకు మళ్ళీ పూనుకుంటే, శ్రీ ముద్దుకృష్ణ ఈవిధంగా అంతం చేయరు నాటకాన్ని.

ఈ నాటకానికి ప్రాణంపోశారు శ్రీ డి. రాజేశ్వరరావు. వారి పాత్రపోషణ 'స్టేజీ' గా ఉంటుందని కొంతవరకు, కొంతవరకు 'అతి' గా నటిస్తారని, నేను ఇదివరలో భావించాను. ఈ పాత్రపోషణలో కూడా ఈ లోపాలు కనపడకపోలేదు కాని, కొన్ని కొన్ని తుణాల్లో ఎంతో ఆనందాన్ని కల్పించింది ఆయన నటన. కొన్ని కొన్ని శరీర భంగిమలు, మాటవిరుపులు మరచిపోడం కష్టం. మిగిలిన నటీనటులు—కుమారి వాణీ కుమారి, శ్రీయుతులు పన్నూరి రామారావు, జి. సత్యనారాయణ, రామాచారి, కోట వెంకట్రామయ్య—ఉచితరీతిని నటించారు.

## 'కుంభకర్ణుడి పునర్జన్మ' -(4)

'పునర్జన్మించిన' కుంభకర్ణుడు ఒక కంటిలో సగం తెరిచాడు ఈ నెల్లో. 'బడేచావుడీ' వద్దనుంచి కాచిగూడ చౌరస్తావద్దకు పోయే బాట పరిస్థితినిగురించి రెండుమూడు వారాల క్రితం ప్రస్తావించాను. ఇప్పుడు రోడ్డును బాగుచేయడానికి నిశ్చయించింది పుర పాలకసంఘం. వచ్చే రెండుమూడు నాలుగు సంవత్సరాల్లో ఎప్పటికైనా ఆరోడ్డు బాగు పడిపోవచ్చు.

ఆరోడ్డు అలా విడిచిపెట్టి, చిక్కడపల్లి నారాయణ గూడాలమధ్య వంతెన వద్దకు రండి. గతవారం ఆ దాపులో విడిచాను మిమ్మల్ని. ఆ వంతెనకు ఒకచరిత్ర ఉంది. వినండి.

ఎదురుగా విగ్రహంలా నిలబడి ఉన్న పోలీసుజవాన్‌ని చూశారా? అతడు ఉదయం ఎనిమిదినుంచి రాత్రి తొమ్మిదివరకు అలా నిలబడి ఉంటాడు. నారాయణ గూడా నుంచి వచ్చే వాహనాలన్నీ తిన్నగా వంతెనపైనుండి వచ్చేయచ్చు. కాని ఇటు నుంచి అటుపోయేవి తిరిగి నల్లకుంట వంతెన పైనుంచి ఆరు ఫర్లాంగుల దూరం తిరిగి రావాలి. హైదరాబాదు పురపాలక సంఘం దృష్టిలో "అరవై గజాలు = ఆరు ఫర్లాంగులు."

ఈ వంతెనబలం చాలదట. అందువల్ల వంతెన సరిగా వెడల్పు చేయించేవరకు వాహనాలన్నీ తిరిగి రావలసిందేనని శాసించారు నగరపోలీసు కమీషనర్. అలా తిరిగి రావడంవల్ల ఒక్క ఆర్. టి. సీ. బస్సులకే లక్షలాది రూపాయిల వ్యయం జొరుతుందని శ్రీ గురుప్రసాద్ మొరపెట్టారు గత సంవత్సరం. 'నువ్వంటే నువ్వు' అనుకొని, 'నేను కాదంటే నేను కాద'నుకొని పనికి పూనుకోకుండా కూచున్నాయి పురపాలక సంఘం, పి. డబ్ల్యు. డి. రెండూ.

వంతెన వెడల్పు చేయడానికి ఎన్నడో శంకుస్థాపన జరిగింది. మీరు జాగ్రత్తగా వంతెన గోడపైనుండి వంగిచూడండి. కని పిస్తాయి రాళ్ళు అటు. ఇటు. పక్కా.

రాత్రి తొమ్మిది దాటేవరకూ వాహనాలు ఇటుపోడానికి వీల్లేదు. రాత్రి అటు కారుచీకటి. దీపాలు వెలిగించాలనే శ్రద్ధ యం పాలకసంఘానికి లేదు. ఒకసారి (1957) దీపావళికి ఒక బాలిక నగల కోసం దారుణంగా హత్యచేయబడింది అటు దిక్కున. ఈ విషయం గత జనవరిలో ఒక సారి, అంతకు ఒక ఏడాదిముందు ఒకసారి, శ్రీ కమీషనర్ దృష్టికి తేబడింది. ఇంకా అక్కడ దీపాలు లేవు. దీపాలు వేయాలనే ప్రయత్నం లేదు.

ఈలాగా ముషీరాబాదు దిశనుంచి రిక్షాల్లో పయనించే ఆడవాళ్ళు, పిల్లలు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని పయనిస్తున్నారట. ఏం ప్రయోజనం? కుంభకర్ణుడు నిద్రిస్తున్నాడు. 

# మీ లోకజ్ఞానం మీరే పరీక్షించుకోండి

సాహిత్యం, సంగీతం, చరిత్ర, భూగోళం మొదలైన 10 విషయాలకు సంబంధించిన 50 ప్రశ్నలు ఈ దిగువ ఇస్తున్నాము. ఒక్కొక్క విషయం క్రింద అయిదేసి ప్రశ్నలుంటాయి. ఒక్కొక్క ప్రశ్నకు 1 మార్కు చొప్పున మొత్తం 50 మార్కులుంటాయి. ఒక్కొక్క ప్రశ్నకు సుమారు అరనిముషం చొప్పున 50 ప్రశ్నలూ 30 నిముషాల్లో పూర్తిచేసెయ్యాలి. మీరు జవాబులన్నీ వెంటనే వేరే కాగితంమీద వేసుకుని, అన్నీ అయినతర్వాత 5౹ వ పేజీలోని సమాధానాలతో పోల్చి చూసుకుని మార్కులు వేసుకోండి. లోక విజ్ఞాన రంగంలో మీ స్థానం ఎక్కడో చూసుకోండి. నలుగురైదుగురు కూర్చుని ఈ ప్రశ్నాపత్రంతో కాలక్షేపం చేయవచ్చును. మీ రొక్కరే కూర్చుని జవాబులు రాసేటప్పుడుమాత్రం మీరు ఏ పుస్తకాల్లోంచీ కాపీ కొట్టటానికి వీల్లేకుండా మీ అంతరాత్మని "వాచర్"గా నుంచోబెట్టి మరీ మొదలెట్టండి. తెలియనప్పుడు వదిలివేయటం మంచిదికాని 'ఇది కాకపోతుందా' అని ఊహించి రాయకండి.

## I సాహిత్యం :—

(1) ఆంధ్ర మహాభారతంలో ఆరణ్యపర్వం వీరిలో ఎవరు రాశారు ?

తిక్కన, శ్రీనాథుడు, నన్నయ్య, విశ్వనాథ సత్యనారాయణ, ఎఱ్ఱాప్రెగడ.

(2) "మనోరమ"పాత్ర ఈ క్రింది గ్రంథాలలో దేనిలోనిది?

పాండురంగమాహాత్మ్యం, వైజయంతీ విలాసం, నిర్వచనోత్తర రామాయణం, మనుచరిత్రం, ఆముక్తమాల్యద.

(3) ఈ క్రింది గ్రంథాలలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రాసిన మూడింటిని ఏరండి:

చివరకు మిగిలేది, పాపం, జేబుదొంగలు, ఏకవీర, ఓబయ్య, వడ్లగింజలు, శృంగారవీథి, సౌభద్రుని ప్రణయయాత్ర.

(4) "తుణతుణముల్ జవరాండ్ర చిత్తముల్" అనే వాక్యం ఈ క్రిందివారిలో ఎవరన్నారు ?

పోతన, పాల్కురికి సోమనాథుడు, చేమకూర వెంకటకవి, పెద్దన, శ్రీశ్రీ, తల్లావఝుల శివశంకరశాస్త్రి.

(5) ఈ క్రిందివారిలో బ్రిటన్, అమెరికాలకు చెందని ఇంగ్లీషు రచయిత ఎవరు ?

జోసెఫ్ కాన్రాడ్, స్విన్‌బర్న్, షెల్ బార్గర్, రాసెటి, వాల్టర్ స్కాట్.

## II భూగోళం :

(1) ఈ క్రిందిపేర్లలో ఆ వర్గానికి చెందని పేరు పేర్కొనండి.

న్యూజిలాండ్, మలయా, సింహళం, జావా, ఫార్మోజా.

(2) ఈ రెండు నగరాల పూర్వపుపేర్లు చెప్పండి:

లెనిన్‌గ్రాడ్, హైదరాబాద్.

(3) ఏవిటిలో ప్రపంచంలోకల్లా అతిశీతలప్రదేశం కనుక్కోండి.

సైబీరియా, స్కాట్‌లాండ్, ఉదకమండలం, అరిజోనా.

(4) చంద్రమండలం ఊడిపోగా మిగిలిన సముద్రం ఇదని కొందరి నమ్మకం:

అట్లాంటిక్, పసిఫిక్, హిందూమహాసముద్రం.

(5) ఆరవఖండం ఏది ?

## III సంగీతం :

"రాగసుధారస..." పాట రాసినవారు వీరిలో ఎవరు ?

శ్యామాశాస్త్రి, దీక్షితర్, త్యాగరాజు, అన్నమాచార్యులు.

(2) ఈ ప్రముఖ వాద్య నిపుణులలో వేణువు వాయించేవారెవరు ?

బిస్మిల్లాఖాన్, రవిశంకర్, ద్వారం, అలీఅక్బర్‌ఖాన్, పన్నాలాల్ ఘోష్.

(3) పాల్ రోబ్సన్ ఈ క్రింది దేశాలలో దేనికి చెందినవాడు ?

ఆఫ్రికా, రష్యా, అమెరికా, ఇంగ్లండ్.

(4) 'రాక్ ఎన్ రోల్' ఏ దేశంలో సంభవించింది ?

(5) ఈ క్రిందివారిలో ఎవరినుంచి సంగీతకళ ఉద్భవించిందని మనవారి నమ్మకం ?

లక్ష్మి, సరస్వతి, నారదుడు, శివుడు.

## IV సైన్సు :—

(1) పరమాణువులో ఒక కేంద్రంచుట్టూ ఎలక్ట్రాన్లు తిరుగుతుంటాయని వీరిలో ఎవరు మొదట ప్రతిపాదించారు ?

డిమాక్రిటస్, ఐయిన్‌స్టీన్, రూథర్‌ఫోర్డ్, రామన్.

(2) నాల్గవ పరిమాణం (ఫోర్త్ డైమన్షన్) అంటే విటిలో ఏది ?

కాంతి, శబ్దము, శక్తి, కాలము.

(3) సూక్ష్మక్రిములను కనిపెట్టిన శాస్త్రజ్ఞుడు వీరిలో ఎవరు ?

నోబెల్, పాశ్చర్, అరిస్టాటిల్, హాల్డేన్.

(4) వనస్పతి తయారు చేసేందుకు కావలసిన వాయువు వీటిలో ఏది?

ఉదజని, ప్రాణవాయువు, బొగ్గుపులుసువాయువు, నత్రజని.

(5) ప్రస్తుతం కృత్రిమంగా బంగారం తయారు చేయటానికి వీలుందా, లేదా?

## V రాజకీయాలు :—

1. "స్వరాజ్యం నాజన్మహక్కు" అని మొదట అన్నవారు వీరిలో ఎవరు?

మహాత్మగాంధి, సర్దార్ పటేల్, రవీంద్రనాథ టాగూర్, బాలగంగాధరతిలక్, జవహర్ లాల్ నెహ్రూ.

2. సోషలిజమ్‌ను వాడుకలోకి తీసుకువచ్చింది వీరిలో ఎవరు?

కారల్ మార్క్స్, రాబర్ట్ ఓవెన్, ఎంగెల్స్, జాన్‌స్టువార్ట్ మిల్.

3. బెర్లిన్ పట్టణం ఈక్రిందివారిలో ఎవరి అధీనంలో ఉన్న ప్రాంతంలో ఉంది?

అమెరికన్లు, రష్యన్లు, పశ్చిమజర్మన్లు, ఇంగ్లీషువారు.

(4) ప్రస్తుతం క్యూబాలో అధికారంలో ఉన్న నాయకుని పేరు ఈ పట్టికలో వెదకండి.

పెరాన్, ట్రూజిల్లో, కాస్ట్రో, సాలాజార్.

(5) అల్జీరియా విప్లవకారుల ప్రభుత్వం ప్రస్తుతం ఏ పట్టణంలో వుంది?

ట్యూనిస్, డామస్కస్, అల్జీర్స్, కెయిరో.

## VI మతం, వేదాంతం :

(1) సాంఖ్యశాస్త్రం ప్రతిపాదించిన మహర్షి వీరిలో ఎవరు?
గౌతముడు, కణాదుడు, కపిలుడు, చార్వాకుడు, వ్యాసుడు.

(2) జెన్ బౌద్ధమతశాఖ ఈ దేశాల్లో దేనిలో వుంది?
టిబెట్, సింహళం, చైనా, సయాం, జపాన్.

(3) వేదాలకు మొదటి భాష్యం వ్రాసినవారు ఎవరు?
రామానుజులు, శంకరులు, సాయనులు, రాధాకృష్ణన్, రమణ మహర్షి.

(4) మహమ్మదు ఒప్పుకున్న సృష్టి సిద్ధాంతం ఈ క్రింది గ్రంథాలలో దేనిలో ఉన్నది?

బైబిలు, జరాథుష్ట్ర గాథలు, హిందూ పురాణాలు.

(5) ఎగ్జిస్టెన్షలిజమ్ ప్రతిపాదించినది వీరిలో ఎవరు?
కీర్కెగార్డ్, కాంట్, రసెల్, ప్లేటో.

## VII సినిమాలు :

(1) వీటిలో మొదటి తెలుగుటాకీ ఏది?

మహానంద, లవకుశ, శకుంతల, భక్త ప్రహ్లాద, సావిత్రి

(2) భారతీయ చిత్రాల్లో ఎక్కువ అంతర్జాతీయ బహుమతులు పొందిన చిత్రం ఏది?

ఝాన్సీకీ రాణీ, దో ఆంఖే బారాహాత్, పథేర్ పాంచాలీ, నీచనగర్, జాగ్ తే రహో.

(3) భారతదేశంలో తయారైన మొదటి ఇంగ్లీషుభాషా చిత్రం ఏది?

రాజనర్తకి, టైగర్ ఎండ్ది ఫ్లేమ్, కర్మ, ఝన్‌ఝన్, హారిబ్లాక్ ఎండ్ది టైగర్.

(4) రాష్ట్రపతి రజతపతకం బహుమతిపొందిన మొదటి తెలుగు చిత్రం ఏది?

విప్రనారాయణ, తెనాలిరామకృష్ణ, పెద్దమనుషులు, అర్ధాంగి, ఏది నిజం.

(5) "ఇవాన్‌ది టెరిబుల్" చిత్రం తీసిన దర్శకుడు వీరిలో ఎవరు?

పుడోవ్కిన్, ఆర్సెన్‌వెల్స్, హిచ్‌కాక్, ఐసెన్‌స్టీన్ ఫాన్‌స్ట్రాహైం.

## VIII చరిత్ర :

(1) ఈక్రిందివారిలో ఒకే శతాబ్దానికి చెందిన ముగ్గురి పేర్లు చెప్పండి:

జొరాస్టర్, హోమర్. వ్యాసుడు, పైతాగరస్, కన్ఫూషియస్, చాణక్యుడు, జూలియస్ సీజర్, బుద్ధుడు.

(2) ఈక్రిందివారిలో ఏ క్రైస్తవ సన్యాసి మనదేశానికి వచ్చినట్లు చెబుతారు?

పీటర్, తామస్, ఫ్రాన్సిస్, అగస్టయిన్.

(3) ఈక్రింది దేశాల్లో దేనిలో మహమ్మదు పుట్టాడు?

పర్షియా, ఈజిప్టు, టర్కీ, అరేబియా.

(4) వీరిలో మొదట భారతదేశంపై దండెత్తినది ఎవరు?

మహమ్మద్ ఘోరీ, బాబర్, నాదిర్షా, గజినీ.

(5) పాశ్చాత్య విద్యావిధానం మనదేశంలోకి రావాలని మొదట వాదించిన భారతీయుడెవరు?

కేశవచంద్రసేన్, రాజారామమోహనరాయ్, దాదాభాయ్ నౌరోజీ రనడే

## IX శిల్పం, చిత్రకళ:

(1) గ్రీకుశిల్ప ప్రభావం ఉందనబడే శిల్పం వీటిలో ఏది?
గాంధార, పల్లవ, శాతవాహన.

(2) మహాబలిపురంలోని శిల్పాలు ఈ క్రిందివారిలో ఎవరికి చెందినవి?

చోళులు, పాండ్యులు, నాయకరాజులు, పల్లవులు.

(3) పాడుపడిన హైందవ దేవాలయాలు ఈ దేశాల్లో దేనిలో కనబడ్డాయి?

చైనా, కాంబోడియా, జపాన్, ఆస్ట్రేలియా.

(4) కుడ్యచిత్రాలకు వీటిలో ఏది ప్రసిద్ధికెక్కినది?
ఎల్లోరా, అజంతా, అమరావతి, మథుర.

(5) శిల్పానికి వీరిలో ఎవరు పేరుపొందారు?
రవీంద్రనాథ టాగూర్, దేవి ప్రసాద్ రాయ్ చౌధురి, జామినీరాయ్, శ్రీనివాసులు.

## X క్రీడారంగం :

(1) ధ్యాన్‌చంద్ ఈ క్రింది ఆటలలో దేనిలో ప్రసిద్ధుడు?
ఫుట్‌బాల్, పోలో, హాకీ. బేస్‌బాల్.

(2) క్రికెట్ పోటీల్లో స్వదేశానికి కాక ఇంగ్లండుకు ప్రతినిధిగా పాల్గొన్న భారతీయుడెవరు?

నవాబ్ ఆఫ్ పాటౌడి, ప్రిన్స్ రంజిత్ సింగ్ జీ, రామన్ సుబ్బారావు, లాలా అమర్ నాథ్.

(3) నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్‌లో గెలిచినవారికి ఏది బహూకరిస్తారు?

డురాండ్ కప్, రోవర్స్ కప్, ఐ. ఎఫ్. ఎ. షీల్డు, సంతోష్ ట్రోఫీ.

(4) ప్రస్తుతం ఫుట్‌బాల్ ఆటలో వరల్డ్ కప్ స్వాధీనపరుచుకున్న దేశం వీటిలో ఏది?

బ్రాజిల్, జర్మనీ, ఇంగ్లండ్, స్వీడన్.

(5) పోలో ఆటలో అగ్రశ్రేణిలో ఉన్న దేశాల్లో భారతదేశం ఒకటని అంటారు. 19 వ శతాబ్దంలో ఈ ఆటను ఆధునిక పద్ధతులలో మన దేశంలో ప్రవేశపెట్టినవారు వీరిలో ఎవరు?

ముస్లిములు, పోర్చుగీసు, బ్రిటిష్, ఫ్రెంచి

(జవాబులు 54 వ పేజీలో చూడండి) ★

# పరోపకారి

"సత్యశ్రీ"

పల్లెటూరు స్టేషన్‌లో బండి ఆగింది: ముసుగు తన్ని పట్టి నిద్రపోతూన్న శేషాద్రిలేచి కళ్ళు నిరుముకున్నాడు బద్ధకంగా.

బయట యింకా చినుకులు పడుతూనే వున్నాయి. నిన్న ప్రొద్దున్న పట్టుకున్న తుఫానుగాలి యింకా తగ్గనేలేదు. ఈగురు గాలొకటి పైగా. వ్రేళ్ళు వంకర్లు తిరుగుతున్నాయి. కడుపులోనుంచి చలి పుట్టుకొస్తుంది.

"ఎక్కడైనా వెచ్చటికాఫీ దొరికితే బాగున్ను...కనీసం వేడివేడి టీ అయినా ఫరవాలేదు...!" అనుకున్నాడు శేషాద్రి మనస్సులోనే.

కిటికీలోనుంచి తలదూర్చి, ప్లాట్ ఫారం నలుప్రక్కలా, స్టేషన్‌లోకికలయచూచాడు. ఎక్కడో మూల స్టేషన్‌మాస్టరు గదిలో మినుకు మినుకుమనే గుడ్డిదీపం వెలుగుతప్ప స్టేషనంతా అంధకారంలో మునిగిఉంది...! ఇదో వెధవస్టేషను. యిక్కడ బాదాపడమే బుద్ధితక్కువ...అసలు ప్లాట్ ఫారం మీద లైట్లుకూడా ఆరిపోయాయే...!బహుశ కిరసనాయిల్ అయిపోయి వుంటుంది... ఛీ...! అయినా తనకెందుకీ వెధవగొడవ!

గిరుక్కున లోపలకు తిరిగాడు శేషాద్రి. రగ్గును కొంచెం జాగ్రత్తగా కప్పుకుని,ముడుచుకుని, కిటికీకి జేరబడి కూర్చున్నాడు. సిగరెట్టు వెలిగించి, ఆ వెచ్చదనంలో ఏదో ఊహిస్తూ, తాపీగా శూన్యంలోకి చూస్తూండిపోయాడు.

బయట అంతా అంధకారం...వర్షపుజడి కొద్దికొద్దిగా పడుతుంది. దూరంగా పొలాలమీద పచ్చటి పైర్లు, చీకట్లోమసి పూసుకున్నట్టు కళావిహీనంగా కనిపిస్తున్నాయి. ఎత్తుగా కనుపించే తాటితోపులు, చెదరిపోయిన దెయ్యాల మందలా వెనక్కు పరుగెత్తుతున్నాయి.

ఆ కంపార్టుమెంట్‌లో ప్రస్తుతం తనొక్కడే మేలుకొనివుండి తనతోటే అంత వరకు కబుర్లు చెప్పిన,'తెలుగు కాబూలీవాలా' గుర్రు పెడుతు బెర్తుమీద పొర్లుతున్నాడు. అటు యిటు కదలినప్పుడల్లా బెర్తు కిరకిరలాడుతుంది.

ఎందుకైనా మంచిదని దానిక్రిందనుండి తప్పుకుని ప్రక్కకు జరిగి కూర్చున్నాడు. తనకు మెలకువ వస్తే మళ్ళిగింజుకున్నా నిద్రపట్టదు. అసలు ప్రయాణాల్లో అసలే పట్టదు...కూర్చుని కూడా నిద్రపోతున్నారు వాళ్ళకెలానిద్రపడుతుందో తనకర్థంకాదు.. శేషాద్రి బలవంతంగా కళ్లుమూసుకుని నిద్రపోవడానికి ప్రయత్నించాడు గాని కన్ను మూతపడిందికాదు.

కిటికీలోనుంచి తలదూర్చి మరొకసారి బయటకు చూచాడు. దూరంగా బారులు తీర్చిన లైట్లు క్రమంగా దగ్గరకొస్తున్నట్టు అనిపించింది.

ఎందుకోవళ్ళు పులకరించింది శేషాద్రికి.

"ఎవిటో?" అని చప్పరించాడు. ఒక వెచ్చటినిట్టూర్పు వదిలాడు. తన అమూల్యమైన హృదయం అక్కడే దిగవిడిచాడు. కాదు తనకు తెలియకుండానే ఎల్లవేళలా ఆ వూరులోనే విహరిస్తూంటుంది...అదంతా తలచుకుంటే పెద్ద గాథ...! అదంతా యిప్పుడెందుకు?" యింకా ఏవో ఏవో ఆలోచించేలోగా రైలు ప్లాట్ ఫారంమీద ఆగింది.

స్టేషన్ కొంచెం పెద్దది కావడంవల్ల అర్ధరాత్రయినా సందడిగావుంది. శేషాద్రి దిగి, కొంచెం వేడి వేడి టీ త్రాగి, ఫ్లాస్కులో కూడా పోయించుకుని వచ్చి యథాస్థానం ఆక్రమించాడు. బెంచీలు ఖాళీగా వుండటం వల్ల, కాళ్లుచాచి రగ్గు ముసుకుపెట్టి పడుకున్నాడు. తెల్లవారి 10 గం॥ అయితేగాని తన ఊరు చేరడు..."ఈలోగా యిక లేచే అవసరం ఏముంది...?" అనుకున్నాడు.

అప్పుడప్పుడే రైలు కదులుతుందనగా, ఎవరో స్త్రీ, తలుపు త్రోసుకుని ఎక్కి, తలుపు మళ్లీ వేసింది. చంకలో చంటిపిల్ల వాడు కాబోలు ఏడుస్తూన్నాడు. పడుకున్నవాడల్లా, కొద్దిగా లేచి, చూచి, మళ్లీ పడుకుండిపోయాడు. ఆమె అటువైపు తిరిగి తలుపు వేస్తూడటంవల్ల ముఖం సరిగా కనిపించలేదు.

"ఎవరో పాపం...! చంటిపిల్ల తల్లిలా వుంది- యింత అర్ధరాత్రి, వర్షం గాలిలో ప్రయాణం కాకపోతే ఏంపోయింది...? పైగా చంటిపిల్ల వున్నట్టుంది! ఎవరో పాపం! వెంటకూడా ఎవరూ లేనట్లున్నారు..." అంటూ కాసేపు జాలిపడ్డాడు శేషాద్రి.

ఆమెవచ్చి, శేషాద్రి పడుకున్న సీటుకు వెనకగావచ్చి, అటువైపు ముఖంపెట్టి కూర్చుంది.

ఆమె వర్షంలో తడిసినట్టుంది... బట్టలునీళ్ళుకారుతూనే. తలతడిసి, నుదుటిమీదకు నీటిబిందువులు రాలుతూన్నాయి. బట్టలు తడిసి వుండటంవల్లేమో చలికి, భుజంమీద ఉన్న చంటివాడు ఏడుస్తూన్నాడు. ఆమె సముదాయిస్తూంది.

ఈ అల్లరికి ఆ పెట్టెలో పడుకున్న కొందరు మేలుకొని, కాసేపు విసుక్కుని, నిద్రమత్తుకు ఆగలేక మళ్ళీ పడుకున్నారు. బెర్తుమీద పడుకున్న కాబూలీవాలా ఏదో గొణుక్కుని, రగ్గుముఖంనిండా, చెవులనిండా కప్పుకుని మరో ప్రక్కకి తిరిగి పడుకుండిపోయాడు.

ఆమె శేషాద్రి పడుకున్న బెంచీకి మరీ దగ్గరగా వుండటంవల్ల, ఆ కుర్రవాడి ఏడుపు శేషాద్రి చెవుల్లో బాకాలు వూదినట్లు మరీ గింగురుమంటూంది - రగ్గును చెవులమీదకు లాక్కుని ముడుచుకుని పడుకున్నాడు కాని ఎంతోసేపు ఓపిక పట్టలేక లేచి కూర్చుండిపోయాడు శేషాద్రి.

"యిదెక్కడిగోల...!" అనుకున్నాడు. కానీ క్షణంలోనే జాలివేసింది ఆ కుర్రాడి మీద-"అసలు యింతగా ఏడవడానికి కారణం బహుశా బాగా తడిసి వుండటం వల్ల, చలికి తట్టుకోలేకపోతూండాలి...! అవును మరీ! తను మామూలుగా వుండి కూడా ఈ దురుగాలికి వణికిపోతూన్నాడు. ...పాపం ... చంటి కుర్రాడు...! అసలు యింత ఈదురుగాలిలో, చంటికుర్రాడితో అర్థరాత్రి ప్రమాణం చెయ్యమని ఎవడు చెప్పాడు ఈవిడకి...?"

తను కప్పుకున్న రగ్గుతీసి ఆ కుర్రాడికి కప్పమని యిద్దామా అనుకున్నాడు శేషాద్రి. ఏమో! ఒకవేళ ఆమె నిరాకరిస్తే తనకది ఎంత అవమానం? అయినా తన కెందుకీ గొడవలన్నీ...! అంటూ తనలో తనే సమాధానపడ్డాడు.

ఆమె భుజంమీద పడుకున్న కుర్రాణ్ని మరో భుజంమీదకు మార్చుకుంది.

ఈ సారి ఆమె ముఖం ప్రక్కవాటుగా స్పష్టంగా కనిపిస్తూంది...

శేషాద్రి ఆమెముఖం చూడగానే ఉలిక్కిపడ్డాడు!...

"ఎవరది...? సుభద్రేనా...?! యింత రాత్రిలో యిలాటి సమయంలో వంటరిగా బయలుదేరాల్సిన అవసరం ఏముంటుంది...? బహుశా కాదేమో!"

అయినా అనుమానం పీడిస్తోంటే, యిక అక్కడ కూర్చోలేక. అటువైపు గేటుదగ్గరకు వెళ్ళేమిషతో లేచివెళ్ళాడు. ఆమెను చూచిన తరువాత స్తబ్ధుడై నిలబడిపోయాడు శేషాద్రి...!

"సుభద్రే...! యిదేంఖర్మ...!" అనుకున్నాడు.

ఆమె అప్రయత్నంగా తలఎత్తి, ఎదురుగా నిలబడ్డ శేషాద్రిని చూచి తెల్లబోయింది...వెంటనే మాటరాలేదు... ముఖం దిగులుగా దించేసింది.

"ఏమిటి సుభద్రా...? యిదేమిటి...? యింతరాత్రిలో... చలిగాల్లో... ఎక్కడికి బయలుదేరావు...?"

ఆమె సమాధానం యివ్వలేదు. ఇచ్చే స్థితిలో లేనట్టే కనిపించింది. ఆమెముఖం చూస్తే వ్యాకులతతో నిండినట్టువుంది. కళ్లు బాచి "ఎర్రపడ్డాయి. అంతకుముందు బాగా ఏడ్చినట్టు కనిపిస్తోంది ఆమెపరిస్థితి.

ఏదో అఘాయిత్యం జరిగివుంటుందనుకున్నాడు శేషాద్రి. అయితే ఆ అఘాయిత్యం ఏమిటో అర్థంకాలేదు.

గుచ్చిగుచ్చి అడిగినమీదట ఆమె సమాధానం యిచ్చింది దిగులుగా..."బాబాయి దగ్గరకు...!"

"బాబాయి దగ్గరకా...? దేనికి...? రాత్రిబండికి బయలు దేరాల్సిన అగత్యం ఏమొచ్చింది...? 5 గంటలబండి వుందిగా! ...లేకపోతే తెల్లవారి ఏడున్నరబండి వుందిగా...! అసలు ఒక్కదానివే బయలు దేరావు? రామారావు ఏడి?" ఏదో అనుమానం పీడిస్తూనే వుంది శేషాద్రికి.

ఆమె సమాధానం యివ్వలేదు. పవిట కొంగులో ముఖందూర్చి, చంటివాణ్ని రొమ్ములకు అదుముకుంటూ బావురుమంది సుభద్ర...!

తికమకలు పడ్డాడు శేషాద్రి. ఆమె అంత యిదిగా ఎందుకేడుస్తోందో అర్థం కాలేదు. ఒకవేళ రామారావుతో గాని ఏమైనా కీచులాట పెట్టుకుందా...? అది అసంభవం! తనకు తెలిసినంతవరకూ వాళ్ళిద్దరిమధ్య ఏవిధమైన స్పర్థలుండవు—ఎలావుంటై...? సుభద్ర రామారావును కోరికోరి చేసుకుంది!

శేషాద్రికి ఈ ఊహా తట్టగానే ఏదో పూర్వస్మృతి జ్ఞప్తికొచ్చి వళ్ళుపులకరించి ఒక పెద్ద నిట్టూర్పువదలి మళ్ళి వెంటనే సమాధానపడి ఆమెకు ఎదురుగా వున్న సీటులో కూర్చున్నాడు. అంతేగాని, అలా అని అడగటానికి ధైర్యం చాలిందికాదు.

ఈదురుగాలి యింకా తగ్గనేలేదు. వర్షపు జడిమాత్రం తగ్గింది. కిటికీలోనుంచి చూస్తోంటే, నల్లమబ్బుల్లో దశమినాటి చంద్రుడు మసకమసగ్గా కనిపిస్తూన్నాడు. దూరంగా ఏటిమలుపులు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. ఏటివారన కనిపించేచెట్లు ఎవరో తరుముతూన్నట్టు వెనక్కు పరుగెత్తుతున్నై.



# పరోపకారి

సుభద్రచంకలో కుర్రాడిఏడుపు కాస్త తగ్గింది. కాని చలికి యింకా వణుకుతూనే వున్నాడు. సుభద్రకూడా వణుకుతూంది.

శేషాద్రికి ఏదోతట్టినట్లై, ఆ సీటులో నుంచిలేచి తను పడుకున్న సీటులోకివెళ్ళి రగ్గు ఫ్లాస్కు తెచ్చాడు.

"ఇదిగో! మాడుసుభద్రా! వాడెలా వణుకుతున్నాడో...! యిదికప్పు!" అంటూ యిచ్చాడు. సుభద్ర మారుమాటాడకుండా రగ్గుతీసుకుని వాడికిమాత్రం మందంగా కప్పింది.

శేషాద్రి ఫ్లాస్కులో టీని కప్పులోపోసి సుభద్రకి అందివ్వబోయాడు—

"వద్దు శేషాద్రి—రాత్రుళ్ళు నాకీ టీ పట్టించను—" అంది సుభద్ర.

"శేషాద్రికి ఏదో షాక్ తగిలినట్లయి వెంటనే సర్దుకున్నాడు.

"పోనీ నువ్వు తీసికో—బాగా తడిసి వున్నావు......చలివెయ్యడంలేదూ—?" అన్నాడు అతి దీనంగా, ప్రాధేయపడుతూ.

సుభద్రకాదనలేక పోయింది...అయిష్టంతోటే. మర్యాదకోసం తీసుకుంది.

భుజంమీద చంటివాడు—రగ్గువుండటం వల్ల వెచ్చగా యిక కదలకుండా పడుకున్నాడు.

వాళ్ళిద్దరి మధ్యా కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. వూరికే వుండలేక శేషాద్రే ప్రశ్నించాడు:

"మరి రామారావేడీ...? ఒక్కదాన్నీ చంటివాడితో ఎలా పంపాడు...? అసలు యింత తొందరగా బాబాయి దగ్గిరకు వెళ్లాల్సిన అవసరం ఏమిటే..?"

'యిందాకటి ప్రశ్నే వేశావు!' అన్నట్టు చూచి తలదించుకుంది సుభద్ర. "బాబాయికి ఏమన్నా యిదిగావుందా...?" అన్నాడు శేషాద్రి తను ఊహించింది ఎంతవరకూ నిజమైవుంటుందోనని. ఈ మధ్య 'బాబాయి'కి వంట్లో బాగోలేదని ఎక్కడినుంచో గాలి కబురువస్తే విన్నాడు. ఒకవేళ అకారణమే అయివుంటుంది...! అనుకున్నాడు.

"అవును-' అన్నట్టు తలవూపింది సుభద్ర.

శేషాద్రి ఉలిక్కిపడ్డాడు—"నిజమే నన్నమాట" తనూహించిందే నిజమైంది...!

సుభద్ర మరీ దిగులుగా వుంటం కనిపెట్టి వూరడింపుగా నాలుగుమాటలు చెప్పి యిక ఎక్కువగా మాట్లాడించకూడదనుకున్నాడు. మాట్లాడించినా సరిఅయిన సమాధానాలు వచ్చేటట్లు కనిపించలేదు శేషాద్రికి...

మాట్లాడకుండా కిటికీకి జేరబడి బయటికి

చూస్తుండి పోయాడు. సుభద్ర అలానే జేరబడి కుర్రాణ్ని రొమ్ములమీద పడుకో బెట్టుకొని కునికిపాట్లు పడుతూంది...

రైలు దడదడ శబ్దంచేస్తూ వంతెనదాటి పోయింది. లయబద్ధంగా రైలుదప్పుడు చేస్తూ వస్తూంటే శేషాద్రి ఏదో ఊహిస్తూ మబ్బు క్రమ్ముకుంటూన్న ఆకాశంలోకి చూస్తూన్నాడు.

"ఏనాటి సుభద్ర...! తను ఎప్పుడైనా ఊహించాడా"? ఈ విధంగా కనిపించడం సంభవిస్తుందని...! చిత్రంగా లేదూ...?" నిట్టూర్పు విడిచాడు శేషాద్రి.

శేషాద్రి ఒకసారి ముఖం త్రిప్పి సుభద్ర కేసి చూచాడు. ఆమె బెంచీకి జేరబడి నిద్రకు తట్టుకోలేక అలానే కళ్ళుమూసుకుని కునికిపాట్లు పడుతూంది. పైనవున్న లైట్ల కాంతి ఆమె ముఖంమీద పడుతోంది. నెల వంకలా వంగిన కనురెప్పల్లో వంపుతిరిగి వున్న పెదాల్లో, తను సృష్టించుకుని కూడు కట్టుకుని ఇష్టంగా దాచుకున్న భావాలు ఏవో చెల్లాచెదరై ముక్కలు ముక్కల్లా కనిపిస్తూంటే, ఒక్కొక్క దాన్ని ఏరి ఏరి దగ్గరగాచేర్చి అతుక్కుంటూన్నాడు శేషాద్రి!

"తనుఆకళ్ళల్లోనే ఏవో గగనకుసుమాల్ని చూచేవాడు ఒకప్పుడు. అవన్నీ రాలి సరాసరిగచ్చి తన వడిలోనే పడతాయను కున్నాడు...!

అసలు న్యాయంగా ఆలోచిస్తే సుభద్ర ఎవరు...? శాస్త్రప్రకారంగా తనసొత్తు! స్వయంగా తన తల్లికి మేనగోడలు...! ముఖ్యంగా తను సుభద్రను ఆకర్షించలేక పోవడానికి తనలోవున్న లోపం ఏమిటి...? ఆ రామారావులో ఏముందని? రోజుకో యిస్త్రీజత మార్చడం తప్ప...!

తను అందగాడు కాడా...? అలా అని ఎవరనగలరు...? అంతలోనే వెనుక నుంచి ఎవరో వెన్ను చరిచి, "పిత...!...పిత!!" అని కేక వేసి నట్టైంది.

అదిరిపడ్డాడు శేషాద్రి...

తన దృష్టిపథంలో ఎప్పటిదో, ఏనాటిదో శివాలయంలో వీధి బడి కనిపించింది...! ఎటు చూచినా గోల...తనకేసి చూచినవ్వుతూన్నారే వెధవలు...తనకు అప్పుడు తల బోడిగా వుండేది...! చిన్న పిలక ఒకటి వుండేది...ఎప్పుడూ ఆ కుంటి పంతులు, ఆ పిలక పట్టుకులాగి నెత్తిన మొట్టేవాడు... క్లాసులో అంతా గొల్లుమనేవాళ్ళు... రామారావు, సుభద్ర, తనూ ఒకే తరగతిగా అప్పటిలో! అందరితోపాటుగా సుభద్రా నవ్వేది...అందరూ కలిసి తనకు పేరు పెట్టలేదూ–? తను పీతలా అడ్డంగా నడుస్తాడట...! వెధవలు - ఓర్వలేని వెధవలు... మొన్న మొన్నటి వరకూ అదే పేరుతోనే పిలచేవాడు రామారావుగాడు...! సుభద్ర మాత్రం యిదివరలో తనకేసి చూచి పూరికే నవ్వేది...! ఎందుకు నవ్వేది? తన్ను ఉడికించడానికా...? ఏడిపించడానికా...? తనకేం లోపం వుందని...?

బొగ్గు నలక కంట్లో పడగానే ఉలిక్కిపడ్డాడు శేషాద్రి. ఊహా ప్రపంచం చెల్లాచెదురై మామూలు ప్రపంచంలో పడ్డాడు.

సుభద్రకేసి చూచాడు. ఆమె నిద్ర పోతోంది. అలా నేకూర్చుండి కిటికీలోనుంచి తలపెట్టి చూచాడు. ఏదో స్టేషన్ సమీపిస్తోంది. ఈ వచ్చే స్టేషన్‌లోనే సుభద్ర దిగిపోతుంది కాబోలు!" అనుకున్నాడు. శేషాద్రిలో నిరుత్సాహం ప్రవేశించింది తలచుకోగానే. స్టేషన్ మరీదగ్గరకు రావడం వల్ల సుభద్రను లేపాడు.

స్టేషన్ వస్తుంది! యిక్కడేగా దిగేది... ఒక్కదానివి...! పైగా యింతరాత్రిలో బండెవరు కడతారు? అసలు ఆలోడంతా

# ★ పరోపకారి ★

బురదగా వుంటుంది! ఎలా వెళతావో ఏమిటో!' అన్నాడు శేషాద్రి జాలిగా.

సుభద్ర కంగారుగా లేచి, రగ్గుతీసి, చంటివాణ్ణి భుజంమీద వేసుకుంది. రగ్గుతీసి మడతపెట్టి, శేషాద్రికిచ్చింది.

అప్పటికి తెల్లవారుఝాము 3 గంటలు అవుతూంటుంది. మసకమసక చీకటి ఇంకా పోలేదు. చిన్న చిన్న తుంపరపడుతూనే వుంది. ఈదురుగాలి తగ్గలేదు.

స్టేషన్ రాగానే ప్లాట్‌ఫారం మీదకు వచ్చి ఆగింది రైలు.

సుభద్ర, చంటివాణ్ణి భుజంమీద వేసుకుని, శేషాద్రితో 'వస్తా'ననిమాత్రం చెప్పి, రైలు దిగిపోయింది.

శేషాద్రి ఇదంతా స్తబ్ధుడై చూస్తూండిపోయాడు.

ఒంటరిగా ఎలా వెళుతుంది సుభద్ర. యిక్కడనుంచి మరో మూడుమైళ్ళు బండిమీదపోవాలి.

అలానే ఆలోచిస్తూ గేటుకు జేరబడి చూస్తుండగానే, సుభద్ర స్టేషన్ గేటుదాటి అంతర్ధానమైనట్లు, శేషాద్రిదృష్టిలోనుంచి తప్పుకుంది.

శేషాద్రికి వెంటనే ఏదో మెరుపులా తట్టగానే, హడావిడిగా రగ్గుఅవీ అన్నీ వుండలా చుట్టి, చేతిసంచిలో త్రోసి, వెంటనే రైలు దిగాడు.

దిగి రెండడుగులు వెయ్యగానే రైలు కదిలిపోయింది. గబగబా నడిచి, స్టేషన్ బయటకొచ్చాడు

బయట, బండివాడికోసం వెతుకుతూన్న సుభద్ర, శేషాద్రిని చూచి తెల్లపోయింది.

"ఏమిటి శేషాద్రీ...! నువ్వు కూడా దిగావే?" అంది నివ్వెరపోతూ!

"ఏమీ లేదు— నేనుకూడా మామయ్యను చూచిపోదామని...! పాపం ఎలావుందో ...!ముఖ్యంగా నిన్ను వక్కదాన్నే వెళ్ళనివ్వడం—!" నీళ్ళు నమిలాడు శేషాద్రి.

"నాకేం భయం! ఎన్నిసార్లు వెళ్ళలేదని ...!నాకేమన్నా వూరుకొత్తా...? పాపం! నా గురించి నువ్వు మధ్యలోదిగి, అవస్థపడటం దేనికి...?" అంది సుభద్ర అతనికేసి జాలిగా చూస్తూ.

"అవస్థేముంది...! మామయ్యను చూచినట్టూ వుంటుంది...అదీగాక అక్కడనుంచి మా వూరుకి బస్ రూట్ వుందిగా. మధ్యాహ్నం బస్‌కి వెళతాను—"

దేనికో సుభద్ర అయిష్టంగానే కనిపించింది...చివరకు మనస్సులో వున్న ఉద్దేశాన్ని బయటపెట్టేసింది...!

"అదికాదు శేషాద్రీ...! మనిద్దరం కలసి వెళ్ళడం...! అందులో అది పల్లెటూరు... నీకు తెలియందేముంది...?" అని తలదించుకుంది అస్పష్టంగా అన్నమాటలు. అలా అంటే మానతాడేమో అనే ఉద్దేశించింది.

శేషాద్రికి షాక్ తగిలింది. అయినా వెంటనే తట్టుకోగలిగాడు.

"అదికాదు సుభద్రా...! మనిద్దరం కలిసి వెళితేమాత్రం ఎవరేమనుకుంటారూ? నేనేమయినా పరాయివాణ్ణా...? మీబాబాయి మాత్రం ఎవరు? మా అమ్మకు తమ్ముడు కాడా?" అని కొన్ని క్షణాలు ఆగి "యిటువంటి సమయంలో నువ్వొంటరిగా వెళుతోంటే సహాయంగా వుండి పంపే అర్హత నాకు లేదా సుభద్రా...?" అన్నాడు శేషాద్రి కొస్త ఉద్రేకంగా, అది తన జన్మహక్కుగా పరిగణిస్తూ.

ఈ మాటకి సుభద్ర తెల్లబోయింది. అంత దిగులులోనూ శేషాద్రి అన్నమాటకి నవ్వుకుంది లోలోనే...? మొదటినుంచీ యింతే తిక్కరకం అనుకుంది.

"అదికాదు శేషాద్రీ! లేనిపోని అవస్థ ఎందుకని అన్నాను.! అంతకుతప్ప ఏమీ లేదు. నీ యిష్టం! రా! నేవద్దనడంలేదు!" అంది సుభద్రనవ్వుతూ.

శేషాద్రి వెంటనే బండివాణ్ణి వీపుమీద చరిచి లేపాడు.

"పేటకు బండికట్టాలి..."

వాడుకొస్తనసిగాడు నిద్రమత్తులో. అదంతా బురదవుంటుంది గాబట్టి మూడు రూపాయిలిస్తేగాని బండికట్టనన్నాడు.

బండిబయలుదేరింది. బురదగుంటల్లో పడుతులేస్తూ నడుస్తోంది. సగందూరంవరకు బండివెనకాల నడిచాడు శేషాద్రి.

ఇక మర్యాదగా వుండదనుకుందేమో సుభద్రే బండెక్కమంది. ఎక్కి వెనకాల జేరబడి కూర్చున్నాడు శేషాద్రి.

(49-వ పేజీ చూడండి)

# వెంకన్న ఉద్యోగం

వెంకన్నకు వుద్యోగం దొరికింది. అసలు వాడిదివరలో చాలరకాల వుద్యోగాలు చేశాడు. ఒక రైతు వద్ద పాలేరుగా కొన్నాళ్ళు, లారీక్లీనరుపని కొన్నాళ్ళూ, ఒక షాండ్రీలో గాలితిత్తి వూదేపని కొన్నాళ్ళూ, యిలా రకరకాల వుద్యోగాలు చేశాడు. కాని వాణ్ణడిగితే అవేవీ వుద్యోగాలు కాదంటాడు. నౌకరీలంటాడు. నౌకరీలో బానిసత్వం వుందనీ, వుద్యోగంలో అదిలేకపోగా ఎంతో హుందాతనం వుందనీ వాడినమ్మకం. అసలు వాడికి వుద్యోగం దొరకటం చాలగమ్మత్తుగా జరిగింది. ఏదో పనిమీద డిప్యూటీకలెక్టరుగారు మా గ్రామం రావడం తటస్థించింది. బంగళాలో మునసబు కరణం గార్లూ, నేనూ, మరికొంతమంది రైతులూ కూర్చుని గ్రామ విషయాలు మాట్లాడుతున్నాము. డి|| కలెక్టరుగారు తమయింట్లో పనిచేయడానికి ఒక నమ్మకమైన మనిషి కావాలని మునసబుగార్నడగటం, కొంచెంసేపాలోచించి మునసబుగారు వెంకన్నకు కబురుపెట్టడం జరిగింది. అంటే మావూరంతటికీ వెంకన్న నమ్మకస్తుడని తేలిందన్నమాట. అసలు రహస్యం ఏమిటంటే మునసబుగారికి వెంకన్నమీద ప్రత్యేకమైన అభిమానమేమీ లేదు. కాని యిక్కడ వెంకన్నకు వుద్యోగం సంపాదించిపెట్టింది, మునసబుగారి దయా గాదూ, అభిమానం అంతకన్నా గాదు. కేవలం మునసబుగారి 'ప్రిస్టేజ్' ఇంత మునసబునైవుండి ఒక చిన్నవిషయంలో యింత ఆలోచించడమా అని 'పిలవరా ఆవెంకణ్ణి' అన్నారు. ఇదీ అసలుసంగతి.

వెంకన్న వుద్యోగంమాట విని గంతు లేసుకుంటూ వచ్చాడు అసలు వాడికీమధ్య వుద్యోగంమీద ధ్యాసకల్గింది. రోజూ యిలా పూటకి తడుముకోడం బావుండలేదనీ ఏదో ఒహ నికరమైన వుద్యోగంలో (నౌకరీలో కాదు) చేరాలనీ ఆలోచనగల్గింది. దానికి కారణం సంవత్సరం క్రితం వాడికో కొడుకు పుట్టడమే.

డి|| కలెక్టరుగారు వెంకన్నకు సర్వీస్ కండిషన్స్ యిలా వివరించారు. మొదటిది బస్తీలో కాపురం పెట్టాలి. ఉదయం ఆరున్నరకల్లాపని(యింటి)లోకి రావాలి. పన్నెండింటికి భోజనానికిపోవచ్చు తిరిగి రెండు గంటలకల్లావచ్చి రాత్రి ఎనిమిదిగంటలవరకూ వుండాలి. ఆఫీసుకు పోనక్కర్లేదు. జీతం నెలకు మొత్తం నలభైనాలుగు రూపాయలు.

"ఆ! దాందేముందిలెండి! ఏరా? వెంకా సమ్మతమేనా" అన్నారు మునసబుగారు.

"తమరింతిదిగా సెప్పాలా దొరా. సమ్మతమే." అన్నాడు వెంకన్న మునిముసి నవ్వులు నవ్వుకుంటూ.

"సరే! వెంటనే పనిలో ప్రవేశించు. చాలా నమ్మకంగా పనిచేయాలి సుమా" అందుకున్నారు కరణంగారు.

"మొత్తు వెంకన్నా నీ అదృష్టం పండిందిరా. లేకపోతే దొరగారిచేతుల్లోపడతావా. శ్రద్ధగా, నమ్మకంగా పనిచేశావా నీ భవిష్యత్తు బావుంటుంది. దొరగారికి ప్రమోషనుకూడా దగ్గర్లో వుంది. వారు కలెక్టరవ్వగానే నీఅదృష్టంబావుంటే డఫేదారువు గావొచ్చు." అన్నారు పేరుపడ్డపెద్ద మనిషి రంగయ్యనాయుడుగారు.

"తాతినేని"

ఎంత అఫీసరయితేమాత్రం మనిషి గాదా? పొగడ్తలకు లొంగడా? ప్రమోషను సంగతి వినగానే దొరగారు విలాసంగా నవ్వుకున్నారు.

వెంకన్న వుద్యోగంలో ప్రవేశించాడు. పనంతా సరదాగావుంది. ఆడుతూపాడుతూ చేసుకోవచ్చు. తన కిదోపనా? ప్రొద్దున్నే పోవడం ఇంట్లో చిల్లరపనులు అనగా నీళ్ళు తేవడం అంట్లు తోమడం, ఇల్లు శుభ్రం చేయడం, అవసరమైతే బజారుకెళ్ళి కూరలు తేవడం, ఇంకా అవి ఇవీ చిన్నచిన్న పనులుంటే చక్కబెట్టి భోజనానికి పోవడం. సాయంత్రం అలా పిల్లల్ని షికారుకు తీసుకెళ్ళి తిప్పుకురావడం. ఏమిటో చేతినిండా పనేలేదు. ఇహ జీవితం హాయిగా డగసొచ్చు. ఇదివరకుమాదిరి రోజూ పూటకి తడుముకోనక్కర్లేదు. వొళ్ళు విరుచుకోనక్కర్లేదు. బస్తీ కాపురం పెళ్ళామూ, కొడుకూ. చక్కని వుద్యోగం. ఇంకేం కావాలనుకున్నాడు.

వెంకడు వెంకయ్యగా మారాడు. పెళ్ళాం పేరుగూడా మార్చాడు. మావూళ్ళో వాడి పెళ్ళాంపేరు రత్తి. నాగరికంగా వుండాలని దాన్ని రత్తమ్మగా మార్చాడు. రేపు రత్నమాలకావచ్చు. ఎల్లుండి రత్నావళి, తరువాత రత్నం. ఇలా ఎన్నిమారినా ఆశ్చర్యపడనక్కర్లేదు. నాగరికతకు ఎంతచక్కని నిర్వచనం? ఎవరో చెప్పారట. డి|| కలెక్టరుగారింట్లో పనిచేస్తూ ఇలా పల్లెటూరి అవతారంలో వుంటే బావుండదని. ఇప్పుడు వాడు నిక్కరువేసి పొడుగు చేతుల చొక్కా షోగ్గా వేసుకున్నాడు. గడ్డం నున్నగా గీస్తున్నాడు. క్రాపు పెరగనివ్వడం లేదు. సినీ 'ఫాల్స్ ప్రెస్టేజ్' అనండి. లేకా యింకే పేరైనా పెట్టండి. కాని ఈ మార్పుకి వాడి తప్పులేదు. లోకంతీరు. నిజానికి నెహ్రూగారి కారుడ్రైవరయినా, ఒక మామూలు బస్సు డ్రైవరయినా ఇద్దరి పనీ ఒక్కటే. కాని యిద్దరికీ గౌరవంలో ఎంత తేడా? ఆశ్రయించుకున్న వ్యక్తుల్నిబట్టి నౌకర్ల గౌరవాలు ఆధారపడివుంటయ్. ఢిల్లీ సెక్రేటరియేట్ లో ఒక డిస్పాచింగ్ క్లర్కు అయినా యిక్కడ తాలూకా ఆఫీసు గుమాస్తాని చూస్తే చులకన. వ్యక్తిగతగౌరవంలో మన కేమీ ప్రత్యేకత లేకపోయినా ఫలానా గొప్పవారిదగ్గర పనిచేస్తున్నాం గాబట్టి మనంకూడా గొప్పవాళ్ళం అనే భ్రమ చాలమందిలో చూశాను. ఇది కేవలం ఆత్మవంచన తప్ప మరేమీ కాదు. అలాగే వెంకన్న కూడా. తనో ఆఫీసరుకద్ద పనిచేస్తున్నాడు గాబట్టి తనుకూడా గొప్పవాడననే భావం వాడి మనస్సులో మెరుస్తూ వుంటుంది. దానికి తగ్గట్టు ఇప్పుడు వాణ్ణి అంతా గౌర

# ★ వెంకన్న ఉద్యోగం ★

తంగా చూస్తున్నారు. కొందరు 'ఏమండీ వెంకయ్యగారూ' అనికూడా పిలుస్తున్నారు అలాటి పిలుపు విన్నపుడు మొదట్లో సిగ్గేసేది. ఎప్పుడున్నా మా వూరి మునసబుగారే 'ఏరా వెంకా' అంటే చిన్నబుచ్చుకుంటున్నాడు. 'వెంకయ్యగారూ' అనకపోతే మానె కనీసం వెంకయ్యా అనకూడదా అనుకుని బాధపడేవాడు. కాని పైకనలేక వూరుకునేవాడు. మనిషిలో ఏమార్పొచ్చినా పరిస్థితుల్నిబట్టే.

వెంకన్న జీవితం సాఫీగా పోతోంది. వాడి భవిష్యత్తుకో గ్యారంటీ వుంది. చీకూ చింతా లేదు. రేపెట్లాగనే ప్రశ్న ఇవాళ్టికి లేదు. కాని జీవితం యాంత్రికంగా మారిపోయింది. ఇప్పుడిప్పుడే వాడికేదో తెలియని దిగులు పుడుతోంది. చేతినిండా పనీ లేదు. తీరికా లేదు. డి॥ కలెక్టరుగారి యిల్ల చేబోషులో యిరుక్కుపోయాడు. ఇప్పుడిప్పుడే వాడు కొంచెం వెనక్కి తిరిగి చూసుకుంటున్నాడు. ఉద్యోగం లేనప్పుడు ఇష్టముంటే పనిలోకి పోయేవాడు. లేకుంటే లేదు. అప్పుడు పస్తులున్నా కష్టమనిపించలేదు. ఇప్పుడు అన్నీ వుండి కూడా ఏదో తెలియని మానసిక వ్యధ.

దొరగారింట్లో పనికూడా మొదట్లో వున్నట్లు లేదు. ప్రతిదానికీ తనపనిలో తప్పులు పడుతున్నారు. ప్రొద్దున్నే పోయి, ఎవరికీ, ఏలోటూ రాకుండా చూసుకోవాలి. అయినా ఏదో ఒహ తప్పు వెదుకుతూనే వుంటారు. ఒక రోజున దొరగారు నిద్రలేచేసరికి టూత్ బ్రష్ అందించలేదని మండిపడ్డారు. ఇంగ్లీషులో చాల తిట్లు తిట్టారు. అలాగే ఒహసారి వేణ్ణీళ్ళల్లో చన్నీళ్ళు ఎక్కువ కలిపాడని అమ్మగారు నానా మాటలంది. కూరలు, వాడితో తెప్పించుకోకా మానరు. అర్ధణా, అణా, మిగుల్చుకుంటున్నాడని అనుమానించకా మానరు. ఇలాటి పరిస్థితులే మా వూళ్ళోవుంటే మరుక్షణాన పని చాలించుకునేవాడు. రెక్కలున్న వాడికి డొక్కాడక పోతుందా అనే ధీమాతో వుండేవాడు కాని యీ వుద్యోగం. దీన్ని ఒదిలించుకోవచ్చు. కాని వాడి మనస్సు ఒప్పుకోవడంలేదు. పెళ్ళాం బిడ్డలకోసమైనా ఉద్యోగం చెయ్యాలి. బహుశా వాడు బానిసత్వానికి అలవాటుపడిపోయివుండొచ్చు. దాన్నుండి బయటపడ్డానికి ప్రయత్నించడు. సర్కస్‌లో సింహం కూడా ఒకప్పుడు మృగరాజే. కాని సర్కస్‌లో చేరాక సోమరితనం బలిసి తప్పించుకుందామని ప్రయత్నించదు. యజమాని ఆడమన్నట్లు ఆడుతుంది.

వెంకన్నకు పనంటే మొదట్లోవున్న హుషారు లేదు. మందగొడితనం, పరాకూ ఎక్కువయినయ్. ఇంట్లో కొందరు చెవుడేమోనంటారు. కొందరు చెవుడుగాదు పొగరంటాడు. ఈ అనుకోడం అంతా వెంకన్న వింటూనేవుంటాడు. అసలీ మధ్య వెంకన్నకు ఆలోచనెక్కువయింది. ఆలోచనే మనిషిని కృంగదీస్తుంది. హత్యచేసేవాడాలోచిస్తే ఆపని చేయలేడు. పాకీవాడు వాడుచేసేపని హీనమైనదనుకుంటే ఎలా చేయగలడు. శ్రీకృష్ణుడు గీతలో స్థూలంగా చెప్పింది కూడా అదే. 'ధర్మం గిర్మం జాంతానై. బంధువులూ, మిత్రులూ అనుకోవడం కేవలం భ్రమ. మానవుడి ధర్మం తన పని తాను చేసుకోవడమే. అందుకనే నీ ధర్మమయినటువంటి యుద్ధాన్ని చేయక తప్పదు.' అని అర్జునుడికి బోధించాడు.

దొరగారూ, అమ్మగారూ షికారుకెడితే తన్నూ తీసుకునెడతారు. పిల్లల్ని ఎత్తుకోవడానికీ, గొడుగూ వగైరా పట్టుకోవడానికీ, అప్పుడాలోచిస్తాడు. 'ఇలాఒక్కసారైనా నేపెళ్ళాంతో షికారుకెళ్ళానా? బస్తీలో కాపురంపెట్టాక ఒక్కసారైనా సినిమాకు తీసుకెళ్ళగలిగానా! ఎక్కడ తీరిచస్తుంది! పనున్నా లేకపోయినా టైంప్రకారం దొరగారి యింటిదగ్గరుండాల్సిందే. కుక్క జీవితం తనది. కుక్కా కాపలా కాస్తుంది. తనూ కాస్తున్నాడు. ఇంకా కుక్కే నయం. దాన్ని ముద్దు అయినా చేస్తారు. తన్నేమో కసురుకుంటారు. ఇలా ఆలోచించుకుని బాధపడతాడు. దొరగారి పిల్లలేమైనా తింటుంటే వెంకన్నకు వాడి కొడుకు గుర్తొస్తాడు. ఇంటికెప్పుడు వెడదామా, కొడుకుతో ఎప్పుడు ఆడుకుని ఆనందిద్దామా అనుకునేవాడు. పనంతా చేసుకుని యింటికి చేరుకునేసరికి కొడుకు నిద్రపోయి వుండటం, వుసూరుమంటూ కుక్కి మంచంమీద కూలబడటం, యిదీ వరస.

ఆ రోజు దీపావళి. వెంకన్న మామూలుగా వుదయమే పనిలోకి వెళ్ళి పనులన్నీ తొందర తొందరగా చేసుకుంటున్నాడు. తనూ తలంటు పోసుకోవాలనీ, పెళ్ళాం, బిడ్డలకు క్రొత్త బట్టలు కట్టబెట్టి పండుగరోజు హాయిగా గడపాలనీ అనుకున్నాడు. తను అడుక్కుండానే అమ్మగారు సెలవిస్తుందనుకున్నాడు. కాని పూర్తిగా నిరాశచెందాడు. అమ్మగారామాట అనకపోగా ఈ రోజు పనెక్కువయింది. వూపిరి తీసుకోవడానికి తీరిక లేకపోతోంది. ఇల్లంతా హడావుడిగా వుంది. అమ్మగారి నడిగి తొందరగా ఇంటికి వెళ్లాలనుకున్నాడు. ఇంతలోనే "వెంకయ్యా! ఇంకా మీ యింటికేం వెడతావ్ ఈ పూట యిక్కడే భోంచెయ్" అంది. ఈ ఆహ్వానం వెంకయ్యపై దయతోనో, లేక వాడు వెడితే పనెవడు చేస్తాడనే భయంతోనో ఆ భగవంతుడికే తెలియాలి. మామూలుగా అయితే ఈ ఆహ్వానం సంతోషంగా అంగీకరించేవాడే. కాని ఈ రోజు పండుగ. పండుగపూట పరాయింట్లో భోజనమా? తనెంత తక్కువయితేమాత్రం? పెళ్ళాం బిడ్డలతో గంజితాగినా సంతోషమేగాని ఈ పండుగరోజు దొరలభోజనమైనా తనకేంతృప్తి?' ఇలా చెప్పాలనుకున్నాడు. కాని చెప్పలేకపోయాడు. వెంకన్నకి ఆపూట దొరగారింట్లోనే భోజనం. అసలు వెంకన్నకు అర్థంకానిదే యిది. ఎంత నౌకర్లయినా వాళ్ళకీ పెళ్ళాం బిడ్డలతో పండుగరోజు హాయిగా గడపాలని వుంటుందని ఈ దొరలకు ఎలా అర్థంకాదా? అని.

వెంకన్న పనంతాచేసి యింటికి చేరుకునేసరికి రాత్రి తొమ్మిదయింది. దారివెంట

# వెంకన్న ఉద్యోగం

ఒకటే ఆలోచనలు. కొడుకు పువ్వొత్తులు సరిగా కాల్చాడో లేదో. టపాకాయలు దగ్గరుండి కాల్పిద్దామనుకున్నాడు. కాని తీరిక లేకపోయింది. ఏం తిన్నారో ఏమో? ఛీ! ఎందుకు తన బ్రతుకు పెళ్ళాం బిడ్డల్ని ఒక్క రోజైనా సంతోషపెట్టలేనికొడిక్కి. మనసంతా పీకుతోంది. ఏవో అర్థంలేని ఆలోచనలు వెంకన్నని కృంగదీస్తున్నాయ్. చెప్పలేని ఆవేదన. వెంకన్న ఇంటికి చేరేసరికి కొడుకు గుక్కపట్టి ఏడుస్తున్నాడు. పెళ్లాం ఎంత బ్రతిమాలినా ఏడుపు మానడం లేదు. కారణం ఏదో చెబుతాడుగాని వీళ్ళకర్థంగావడంలేదు. వెంకన్న కొడుకుని తీసుకుని బుజ్జగించాడు. లాభం లేకపోయింది. కోప్పడ్డాడు. ఊహుఁ. అసలే విసుగ్గా వున్నాడేమో చేతికొద్దీ కొడుకు చెంపమీద చరిచాడు. కొడుకు ఏడ్చి ఏడ్చి నిద్రపోయాడు. వెంకన్నకి అన్నం సహించలేదు. రత్తితో మాట్లాడలేకపోయాడు. పక్క మంచంలో కూలబడ్డాడు. ఎంత మరచిపోదామన్నా కొడుకుని కొట్టిన దృశ్యమే గుర్తొస్తోంది. దొరగారి పిల్లలు గుర్రమెక్కించుకోమంటే సరేననాలి. ఏడవమంటే ఏడవాలి. నవ్వమంటే నవ్వాలి. గుంజీలు తియ్యమంటే తియ్యాలి. అలాంటి తను తనకొడుకు దేనికోసమో మారాం చేస్తుంటే సముదాయించుకోలేక విసుగ్గా బాదో దిలిప్పాడు. ఏమి న్యాయం? పరాయి పిల్లల్ని యిష్టమున్నా లేకపోయినా అలా మెప్పించడమేమి? తనకడుపున. పుట్టబట్టే గదా యిలాంటి అన్యాయం. అప్రయత్నంగా వెంకన్న కళ్ళల్లో నీళ్ళు తిరిగినయ్. రత్తి యిదంతా గమనిస్తూనే వుంది. భయం భయంగా చూస్తూ వూరుకుంది. అసలు మొగుడు వుద్యోగంలో చేరినప్పటినుండీ తనకు దూరమౌతున్నాడని రత్తి అనుమానం. రత్తి పరిస్థితి చూసి వెంకన్నకు జాలివేసింది. రత్తిని దగ్గరకులాక్కొని "రత్తీ! నేను మారిపోయినాను గదంటే" అన్నాడు.

"అవును. శానా మారిపోనావ్" అంది రత్తి వెంకన్న కన్నీరు తుడుస్తూ. వెంకన్న గట్టి నిర్ణయానికొచ్చాడు. గుండెబరువంతా తీరిపోయి మైమరచి నిద్రపోయినాడు.

బారెడు ప్రొద్దెక్కినా తండ్రియింకా మంచంమీదే వున్నందుకు కొడుకాశ్చర్యపడుతూ "అయ్యా! అయ్యా! దొలగాలింతికెల్లవూ. పొద్దెక్కిపోయింది" అన్నాడు వెంకన్నని లేపుతూ.

వెంకన్న కళ్ళు నులుపుకుంటూ లేచి కొడుకుని హృదయానికి హత్తుకుంటూ "ఇంకేం దొలగాలింతికిలా? లాత్తిలితో చేమా నేళా" అన్నాడు.

రత్తి చిన్నగా నవ్వింది ★

# నేనూ, మా భగవంతం

నండూరి సత్యనారాయణరావు

ఆ రోజు ఆదివారం. కొత్త మార్కెట్టుకు వెళ్ళి రెండుకూరలు తెచ్చిపడేస్తే వారం రోజులదాకా ఫరవాలేదనుకుని బయలుదేరా.

"పెందరాళే ఇంటికి రండి! తలంటి పోస్తాను. ఏ ఫ్రెండ్సుతోనో బాతాఖానీ వేసుకుని పన్నెండింటికి వచ్చేరు!" అని హెచ్చరిక చేసింది శ్రీమతి.

మెయిన్‌రోడ్డు మీదుగా వెళ్తే ఎవడైనా ఫ్రెండు ఎదురవొచ్చని, అడ్డదోవన వెళ్ళి, తొందరగా ఇంటికి జేరుకోవచ్చని ఒక సందులో దూరాను. తీరా సగానికి వెళ్ళాక గాని గుర్తుకి రాలేదు భగవంతం ఉండేది ఆ సందులోనేనని. తల వంచుకుని గబగబా అడుగులు వేస్తున్నా.

"ఒరేయ్ శంకరం!" అంటూ వినిపించింది వెంటనే చప్పట్లు. అనుకున్నంతా అయింది. కుడిప్రక్క కిటికీలో నుంచి భగవంతం చేతులూపుతూ నన్ను పిలుస్తున్నాడు. లోపలికి వెళ్ళక తప్పింది కాదు. ఎందుకంటే రోడ్డు మీదనుంచి "టాటా" అంటూ చేతులూపితే ఊరుకునేరకం మనిషి కాదు వాడు. వెంబడించైనా సరే నన్ను లోపలికి చేర్చగలడు. ఏదో మొక్కు తీర్చుకున్నట్లు మూడు ముక్కలు మాట్లాడి బయటపడదామనే ఉద్దేశ్యంతో లోపలికి అడుగేశా. దానికి కారణం లేకపోలేదు. మావాడు ఒకరకమైన జిడ్డు మనిషి. కబుర్లకి ఎవడైనా దొరికితే చాలు...ఇక వదలడు. పోనీ ఏదో ఉబుసుపోకకు లోకాభిరామాయణంతో కాలక్షేపం చేద్దామనుకోటానికి కూడా ఆస్కారం లేదు. ఎదుటి వాళ్ళను మాట్లాడనీయడు. తనే మాట్లాడేది తననిగురించి తప్ప ఇంకొకటి మాట్లాడడు.

"ఏమిట్రా తీరిగ్గా ఉన్నావు. మార్కెట్టుకి వెళ్ళటమంటూ లేదా ఏమిటి?"— అన్నా లోపలికి అడుగుపెడుతూ—ఏదో ఒకటి అనాలిగా మరి.

"మార్కెట్టుకు వెళ్ళడం, కూరలు తేవడం, వంట వండటం, వడ్డించటం— ఏమిట్రా ఇవన్నీ మనం చేసేపనులా? అవన్నీ మా యింట్లోమాత్రం మా ఆవిడ డ్యూటీయే. సగర్వంగా సమాధానం చెప్పాడు భగవంతం. కొంచెంగా ఛాతీ ఉబ్బించినట్లు అనుమానం. వాళ్ళావిడ అంత సుంగి(ది)గా ఉండటంలో నాకేమీ అభ్యంతరం లేకపోయినా వంటనే అడ్డు పడకపోతే అప్పట్లో నేను కదలలేను గాబట్టి—

"అవుననుకో. ఐనా ఆదివారం శలవేగా. పోనీ మనకూడా కాలక్షేపం ఐనట్లుంటుంది బజారుకి వెళ్ళొస్తే," అన్నా.

"అయితే ఉన్న ఆ ఒక్క ఆదివారం కూరలు తేవటానికీ, సరుకులు తేవటానికీ బజారు వెంబడి తిరిగితే ఇంక ఆదివారం ఏముంది? అన్నట్లు మా తోడల్లుడొకడున్నాడు. నీలాగే శలవంటూ వచ్చిందంటే చాలు...ఇంట్లో బట్టలుతకడం కూడా వాడే చేస్తాడు. అయినా తోచకపోవటమనేదేమిటి? తోచడం—తోచకపోవడం ఒక మానసిక ప్రవృత్తి. ఈజీచెయిర్లో అలా పడుకుని కళ్ళు మూసుకుని గంటల తరబడి నే కూర్చోగలను (నా కనుమానమే ననుకోండి) మనమేం ఉడతలమా... లేళ్ళమా— ఎప్పుడూ ఎగురుతూ ఉండటానికి పూర్వకాలములో ఋషీశ్వరులంతా నెలలతరబడి. కూర్చున్న వాళ్ళు కూర్చున్నట్లు ఎలా వుండేవాళ్ళు? వాళ్ళకు ఎలా తోచేది..."

వీడు నోరు మెదపకుండా గంటల తరబడి కూచుంటాట్ట. ఎవడైనా కొత్త నమ్ముద్దూ. అయినా వాడితో వాదనేమిటి...అంగులో ఇప్పుడు.

"కూరలకోసం మా ఆవిడ ఎదురుచూస్తుంటుందిరా. మళ్ళీ తర్వాత వస్తాలే," అంటూ కుర్చీలోంచి సగం లేచా.

ఇంతలో భగవంతంకొడుకు ఐదేళ్ళవాడు ఎక్కడినుంచో ఒక్క దూకులో వచ్చి నా ఒడిలో పడ్డాడు. నేను మళ్ళీ కుర్చీలో వాలక తప్పింది కాదు.

"మావాడికి కొత్తంటూ ఏం లేదురా... ఎవళ్ళొచ్చినా సరే...అంతే...అమాంతం మీదపడతాడు. అయినా ఈ రోజుల్లో కలుపుగోలుతనం—చలాకీ లేకపోతే పిల్లలు ఎందుకు పనికొస్తార్రా? మా మరదలు కొడుకొకడున్నాడు...వాడికి కొత్త వాళ్ళను చూస్తే బెదురు. ఆమడదూరాన నుంచుంటాడు—అమ్మకొంగు పట్టుకుని. నువ్వు బిస్కట్లు పెట్టు, బిళ్ళలు పెట్టు, కానీ ఇస్తానను—ఊహుఁ ఆ కొంగుముడి వదిలిరాడు. అథవా చనువు చేసుకుని ఎవరైనా దగ్గరకు తీసుకుంటే ... ఫినిష్...బావురుమంటాడు. మావాడిదగ్గర అటువంటి పిచ్చి వేషాలు లేవు.

నా జేబులోని కలం 'క్లిక్' మంది. అబ్బాయి దాని 'కాప్'ని అడ్డంగా తిప్పుతున్నాడు. వాడి కలుపుగోలుతనం ఎంతో మంచిగుణమైనా నా కలంమీదున్న మమకారంకొద్దీ చెయ్యి లాగాను. వాడు తల అడ్డంగా తిప్పాడు.

"అంత శీలిగ్గా లొంగే ఘటమనుకున్నా

# ★ నేనూ, మా భగవంతం ★

...వుట్రా వాడు. ఒకరోజు వాడేం చేశాడనుకున్నావ్..."

ఇంత బుడుతడు ఎంతైనా చేసుండొచ్చు. అడ్డు పడకపోతే అరగంటదాకా ఊపిరాడదని

"నీ పేరేమిట్రా" అన్నా లాలనగా భగవంతం వైపు చూడకుండా.

"చెప్పరా బాబీ నీ పేరు" అని ప్రోత్సహించాడు భగవంతం.

తల అడ్డంగా తిప్పాడు చెప్పనన్నట్లు. ఇదేమిటి... ఇంత కలుపుగోలుతనం గలవాడు కూడా పేరు చెప్పడానికి సాగదీయించుకుంటాడేమిటి అనుకున్నా.

"చెప్పమ్మా, చెప్పు. మన శంకరం బాబాయేగా చెప్పు" అన్నాడు మా వాడు. "అందరిలాగా కాదురా వాడు. పేరు చెప్పకోవడమంటే తగనిసిగ్గు. అయినా ఎవరి పేరు వాళ్ళు చెప్పుకోవటమేమిటని ఆ కుర్రకుంక ఊహ."

ఇంతలో వాడేకొడుకు "కభాకబీ" అని తుపుక్కున అనేసి ఊరుకున్నాడు. నేను కొంచెం చలించాను. మా భగవంతం పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వడం మొదలెట్టాడు. నాకేమీ అర్థంగాక తెల్లమొగం వేశాను. బాబీగాడుమాత్రం ఇంకా కలాన్ని అడ్డంగా తిప్పుతూనే ఉన్నాడు.

నవ్వుకొంచెం ఆపుకొని "భలే, భలే" అని మళ్ళీనవ్వటం మొదలెట్టాడు భగవంతం. నాకంతా అయోమయంగావుంది.

"అంటే ఏమిట్రా" అన్నా.

"వాడిపేరురా నీకింకా తెలీలేదుట్రా. నీకు భలేగా టోపీ వేశాడ్రా."

"అయితే వీడిపేరు 'కభాకబీ'యేనా ?" అంటూ ఆశ్చర్యపోయా.

"అదే! అదే! వాడిపేరును అందులో ఇమిడ్చి 'నన్ను తెలుసుకో చూద్దాం' అంటున్నాడు."

వాడిపేరు 'కభాకబీ' కాకపోతే 'భళాభళీ' అని పెట్టుకున్నా నాకేమీ అభ్యంతరం లేదుగాని అందులో ఇమిడిఉన్న ఆ ధర్మసూక్ష్మంమాత్రం నాకు అవగాహనకాలేదు.

"కాభావరా. కా భా వ. 'కభాకబీ' అంటే బాబీఅని అర్థం. ఇంతవెధవలేడు వాడికెంతఊహలో చూడు. వీడు పెద్దైతే......"

అవును వీడు పెద్దైతే ఏమైనా కావొచ్చు. అంతర్జాతీయ రాజకీయవేత్తైనా కావొచ్చు. లేకపోతే మనదేశానికి ప్రెసిడెంటైనా కావొచ్చు. ఒప్పుకుంటాను. కానిఆముక్కలు భగవంతం చెప్పడం మొదలెడితే ఇవ్వాళ ఇంట్లో వంటవండినట్లే.

మెల్లిగా బాబీని కిందికిదింపాను. కలం చేతులోకి తీసుకున్నా. ఏ కళనున్నాడో గాని కలం ఇచ్చేశాడు.

"నాన్నా, నేను 'కూ' బండి డ్రైవరు నౌతా పెద్దయ్యాక" అన్నాడు.

మా భగవంతం మొఖంకొంచెం వాడింది.

"వెళ్తారా" అంటూ లేచా.

"అదేమిటి. ఉండు. కాఫీతాగి వెళ్దువుగాని" అన్నాడు.

"వద్దురా. ఇప్పుడే తాగివచ్చా" అన్నా.

"నీకు తెలియదు కూచో. మాయింట్లో ఒకసారి తాగావంటే ఇక వదలిపెట్టవు" అంటూ లోపలికి వెళ్ళాడు.

వెంటనే తిరిగివచ్చాడు.

"అసలు కాఫీపెట్టడంకూడా ఒక కళే ననుకో. అందులో ముఖ్యంగా డికాక్షన్ తియ్యటంలోనే వుంది మజా. నీకొక్కటి చెపుతా. అలాచేసిచూడు. కాఫీ ఎలాగుంటుందో"

ఇంతలో "బాబీ" అంటూ లోపలినుంచి ఒక ఆడగొంతుక వినిపించింది. బాబీ గాడు లోపలికివెళ్ళాడు.

"మాయింట్లో డికాక్షన్ దేంట్లో తీస్తారు" అన్నాడు భగవంతం.

"ఫిల్టర్లోనే" అన్నా.

"అదేతప్పు. ఫిల్టరు అసలు వాడకూడదు తెలుసా." ఏదో పరమరహస్యం ఉపదేశం చేసేవాడిలా మొహం పెట్టి అన్నాడు.

"శుభ్రంగా గుడ్డతో వడబోయ్యాలి. అప్పుడే కాఫీకి రుచివస్తుంది. కావాలంటే ఇవాళ ట్రైచేసిచూడు."

ఇంతలో బాబీగాడు రెండుగ్లాసుల్తో కాఫీతెచ్చి చెరొకటీ ఇచ్చాడు.

నేను తాగేసి సంచితీసుకుని నిలబడ్డా.

"వస్తారా కూరలు తీసుకెళ్ళాలి. ఇప్పటికే ఆలస్యం అయింది" అన్నా.

"అబ్బ ! ఏమితొందర్రా" అంటూ వీధి దాకా వచ్చాడు.

నేవెళ్ళటం వాడికి సుతరామూ గిట్టలేదు. వాడు ఇంటిమెట్లమీదే ఆగాడు. ఆగి, మొఖం అదోలాపెట్టి నన్నొక అనరానిమాట న్నాడు. అందుకే ఈసంగతి ఇంతదాకా రాయాల్సొచ్చింది. అలా అనటం ఏం ధర్మమో చెప్పండి. ఇంతకీ వాడేమన్నాడంటే—

"మీ ఆవిడంటే నీకంత భయమేమిట్రా" అని.

వాడికి బాతాఖానీ వేసుకోవడానికి మనిషి దొరకనంతమాత్రాన నన్నామాట అనడం ఏంబాబు ? ★

# దొంగలు

ఆచంట శారదాదేవి



దొంగలు ఎప్పుడూ ఉన్నారు. కాని మునుపటి దొంగలను తలుచుకొని, ఈనాటి వాళ్ళను చూస్తూంటే, వాళ్ళది చిల్లర వ్యాపారంలా అనిపిస్తుంది. బహుశా రోజులు మారినట్లే, దొంగలూ మారారనుకుంటాను. ఈనాం డెక్కువ చదువుకున్న దొంగలే—

పూర్వం మన దొంగలను చూచి పాశ్చాత్యులు కూడా ఆశ్చర్యపడేవారు. ఎందుకంటే ఆ దొంగల చాకచక్యాలతో కాక ధైర్యసాహసాలు కూడా అసాధారణమే. గత శతాబ్దంలో అంటే ప్రథమ స్వాతంత్ర్య యుద్ధానికి పూర్వం అన్నమాట — ఒక ఇంగ్లీషు ఆఫీసరు, మన దొంగలను గూర్చి తన అనుభవాలను అతి ఆశ్చర్యంగా వ్రాశాడు. ఆ రోజులలో పటాలం గుర్రాలు అమితంగా దొంగిలింపబడుతుండేవి. ఆ దొంగలను పట్టుకోవడం కూడా ఆనాటికి అసాధ్యంగానే ఉండేది. ఒక కల్నల్ ఒక దొంగని ఎలాగో పట్టుకున్నాడు. కాని ఆయనకు ఏమీ తృప్తి లేదు. వాళ్ళ దొంగతనం పద్ధతి తెలిస్తే దొంగలందరినీ ఏకంగా పట్టుకోవచ్చునని ఆ కల్నల్ ఆలోచించాడు. వెంటనే ఆ దొంగతో ఈ విషయం ప్రసంగించాడు. వాళ్ళ దొంగతనాల యొక్క

పద్ధతులను నేర్పితే, దొంగకు కొంత పారితోషికం కూడా ఇస్తానని ఆశ పెట్టాడు. చివరికి దొంగ ఒప్పుకున్నాడు.

అర్ధరాత్రి కల్నల్ గారు తన గుర్రం తీసుకెళ్ళి వూరి బయట మైదానం మధ్యవున్న చెట్టుకి గుర్రాన్ని కట్టి కనిపెట్టుకొని ఉండాలనీ, తను వచ్చి గుర్రం దొంగిలించే పద్ధతంతా నేర్పుతానని చెప్పాడు దొంగ. సరే అన్నాడు కల్నల్.

అర్ధరాత్రి బాగా చీకటిగా ఉంది. వూరి బయట మైదానానికి గుర్రంమీద వెళ్ళాడు కల్నల్. మైదానం పెద్దది. బాగా చీకటి. చివరికి మైదానం మధ్య ఒక చెట్టు కనుపించింది. ఆ చెట్టు చాలచిన్నది, రెండే కొమ్మలు. కల్నల్ గారు గుర్రందిగి గుర్రాన్ని ఒకకొమ్మకు కట్టి నిలబడ్డాడు. ఎంతసేపటికీ దొంగరాడు. గడియలు గడిచిపోతున్నాయి. చివరకు దొంగ మోసంచేసి పారిపోయాడని నిశ్చయం చేసుకున్నాడు. అయినా కొన్నేపు చూదాం అనుకున్నాడు. ఇంతలో కునుకు పట్టింది, చెట్టును ఆనుకొని నిలిచే ఆదోర కొస్తతూగాడు.

ఇంతలో ఆ చెట్టే హటాత్తుగా ఎగిరి, గుర్రంమీద కూర్చొని, గాలప్ ఇచ్చి, గుర్రంతో సహా ఒక్క క్షణంలో మాయమయింది. ఆచెట్టే దొంగ తలకింద పెట్టి, రెండు కాళ్ళు కొమ్మల్లాచాచి చెట్టు అనిభ్రమ కలిగించాడా దొంగ. అలాగే కదలక మెదలక అంతసేపూ నిలబడి చివరకు గుర్రాన్ని పంపాయించాడు. ఈ అనుభవంలోంచి తేప్పరిల్లే సరికి, కల్నలుకు తెల్లారిందని చెప్పవచ్చు. నిజంగా నాడు మనదేశంలో దొంగలు వట్టి సాహసులేగాక, అనేక విద్యలలో సాధనచేసి ఉత్తీర్ణులయిన పండితులని కూడా చెప్పాలి.

బ్రిటిషురాజ్యం దేశంలో స్థిరపడిన తర్వాత దొంగతనం విద్య మనదేశంలో బాగా నీరసించిందని చెప్పవచ్చు. వందల సంవత్సరాలాదిగా అరాజకంలో ఉన్న దేశానికి, ఒక స్థిర ప్రభుత్వం ఏర్పడడమే, ఇందుకు కారణం అనుకోవచ్చు. అయినప్పటికీ మా చిన్నతనంలో కూడా గ్రామాల్లో దొంగ భయం ఎక్కువగానే ఉండేది. నిజంగా నాడు దొంగఅంటే భయంగానే ఉండేది. ఎందుకంటే, ఆనాడు కూడా దొంగలు నేటి చగువున్న మోసగాళ్ళు చేబుదొంగల్లా కాక ఆరితేరి అన్నిటికి తెగించిన శూరులు. వాళ్ళ వృత్తే అది. ఆనాగు వృత్తి అంటే కులవృత్తి.

## పురుషార్ధ సాధన!

ఆనాటికి కూడా, కులవృత్తికి చాల ప్రాముఖ్యం. దానిపట్ల గురికూడా ఉండేది. దొంగతనం బిచ్చమెత్తడం కూడా నాడు కులవృత్తులే. కులవృత్తియందు తీర్ణుడైన వాడికి మోక్షంతప్పదు. విద్యనుబట్టి కులంఅని శుక్రుడన్నాడు. చోరవిద్యను గూర్చి దండి మహాకవి దండిగా ఘనంగా వ్రాశాడు. అన్ని విద్యలు బ్రహ్మనుంచి పుట్టినవే కాబట్టి ప్రతి విద్య మోక్షానికి తప్పక దారితీస్తుందని నమ్మకం. అంచేత మనదేశంలో అనాదిగా కొన్ని కులాలవారు దొంగతనం, తమ కులవృత్తి అని తద్వారానే ధర్మార్ధ కామమోక్షాలను సాధించాలని, ఆ విద్యను బాగా అభ్యసించి సాధనచేసి ప్రావీణ్యం గడించేవారు. నిజంగా వాళ్ళకు మోక్షం వచ్చిందో లేదో, దేవుడే ఎరుగు.

మా చిన్ననాటికి కూడా, దొంగతనం కులవిద్యగానే పరిగణించి అభ్యాసం చేసే కులాల వాళ్ళుండేవారు. ఆ కులాల పేర్లు ఇప్పుడనవసరం. ఎందుకంటె కులాలనూ, కులవృత్తులను మరిచిపోయేరోజులువచ్చాయి. ఈ కులాల్లో కూడా దొంగతనం పదతులు భేదించి వేరు వేరుగా ఉండేవి. ఒక కులం వాళ్ళు చేసినట్లు మరోకులం వారు చేయరు, అలాచేస్తే వాడికి, వాడి కులానికి కూడా చాల అవమర్యాద. ఇందులో ఒకనీతి కూడా ఉంది. నియమం ఉంది. స్వంత పద్ధతులను తప్పించి, మరో పదతిని అనుసరిస్తే ప్రజలకు మరోకులం వాళ్ళమీద అనుమానం కలుగుతుంది. తాను చేసిన నేరం మరొకడి మీదకు తోసితప్పించుకోదలుచుకోవడం అతి నీచమే గాక పిరికితనం కూడా. మోసం కలిగిన దొంగ వాడయితే, తాను తప్పించుకో దలచిందే గాని, నేరం మరొకడిమీద పెట్టకూడదు. ఇది నాటిదొంగల నీతులలో ఒకటి. ఈ దొంగలతుణం కూడా ఒళ్ళ శూరలక్షణమే అని చెప్పవచ్చు.

## బందిపోటుకు పాటు

ఆరోజులలో బందిపోట్లు అప్పుడప్పుడు వచ్చేవి. బందిపోట్ల సంగతి మా పెద్దవాళ్ళు అనుకుంటూ ఉంటే వినేవాండ్లం. బందిపోట్ల సంగతి వింటూ ఉంటేనే భయం వేస్తుండేది చిన్న దుడ్లులాగు బాకోలు ఊగుతుంటూ, తప్పెట్లు వాయించుకుంటు, అర్ధరాత్రిన వారు ఊరు సమాపించేవారు. ఆశబ్దం వినేసరికల్లా ఊళ్లో సగం జనం చెల్లా చెదరయ్యేవారు. కొంతమంది శూరులు తమ ఊరును రక్షించుకోడానికి తయారయ్యేవారు కూడా.

బందిపోటువాళ్ళకీ; వూళ్లో వాళ్ళకీ కూడా ఆ సమయంలో కనికరం ఉండేది కాదు. అనేకమంది చనిపొయ్యేవాళ్ళు. ఒకొక్కొక్కప్పుడు బందిపోటువాళ్ళు, ఓడితే, చచ్చిపోగా మిగిలినవాళ్ళు పారిపొయ్యేవారు. కాని అనేకమార్లు గెలుపు వాళ్ళదే. ఊళ్లో దొరికినవాళ్ళను వాళ్ళు చిత్రవధ చేసేవాళ్ళు. గృహస్థులు ఎక్కడెక్కడో దాచిపెట్టుకున్న సొమ్మంతా బయట పెట్టించి దోచుకు పోయేవాళ్ళు. ఇంకా కసితీరక, ఆడవాళ్ళను చెరిచి, ఇళ్లు తగలపెట్టి, తెల్లారేసరికి, ఊరంతా ధ్వంసంచేసి మరీ పోయేవారు.

కాని మా రోజులొచ్చేసరికి, బందిపోట్లు బాగా సమసిపోయినాయి. చిన్న చిన్న గ్రామాలమీదకి ఎప్పుడో ఒకసారి బందిపోటు వచ్చిందని, అప్పుడప్పుడు కబుర్లు

# ★ దొంగలు ★

వస్తుండేవి. కాని కన్నపు దొంగతనాలు మటుకు ఎక్కువగానే ఉండేవి.

గోడకు ఒక కన్నం పొడిచి, ఇంట్లోకి జొరబడి, చేజిక్కిన సామాన్లు, సొమ్ము దొంగిలించడం కన్న దొంగతనం. ఈ కన్నం వేసే పద్ధతి, లోపల సామాన్లను బయటికి చేరవేసే పద్ధతీకూడా, కులాన్ని అనుసరించే వుండేవి. ఈ విషయం ఆనాడు పోలీసులు కూడా బాగా ఎరుగుదురు. కన్నం చూడగానే, ఫలానా కులంవాడు ఈ కన్నం వేశాడు అని పోలీసులు టకీమని చెప్పగలిగేవారు.

## గృహప్రవేశం

కన్నాల పద్ధతులు నాడు సామాన్యంగా మూడు. ఒక కులంవాళ్లు గోడకు పైగా, కప్పు కింగుగా కన్నం పొడిచేవారుగా, మరో కులంవాళ్లు గోడకు క్రిందగా, నేలమట్టంవద్ద కన్నం వేసేవాళ్లు ఇంకొకరు. తలుపు ప్రక్కగా గోడమధ్య చిన్న కన్నం వేసి, లోపలికి చెయ్యిపెట్టి, తలుపు గడియలను తెరిచి ఇంట్లోకి ప్రవేశించేవారు. ఇంతే కాకుండా కన్నంలోంచి ఇంట్లోకి ప్రవేశించే పద్ధతులుకూడా కులాన్ని బట్టే ఉండేవి. ఒక కులంవాళ్లు కన్నంలోంచి తల ముందు లోపలికిపెట్టి, ప్రవేశించేవారు. మరో కులంవారు కాళ్లు ముందుకు పెట్టి ప్రవేశించేవారు. ఇంట్లో ప్రవేశించాక కూడా, దొంగతనం పద్ధతులు సయితం చాలవరకు కులాన్ని బట్టే వుండేవి. ఒక కులంవాళ్లు అయితే, జట్టుగా వచ్చిన దొంగలందరూ మొట్టమొదట వంట ఇంట్లోకి వెళ్లేవారు. అక్కడ పాత్రలన్నీ శోధించి, మిగిలిన అన్నం మొదలయినవన్నీ తినిగాని, అసలు దొంగతనానికి ఉపక్రమించేవారు కారు. ఒకొక్కప్పుడు వాళ్లు అన్నం తినే వేళలోనే ఏదో సద్దు అయ్యేది. తింటూ తింటూన్న అన్నం, అంతా వదిలేసి, చిటికలో పారిపోయేవారు. ఈకులంవాళ్ళ దొంగతనాన్ని పోలీసులు వెంటనే ఆచోకి పట్టేసేవారు. ఈకులంవాళ్ళ దొంగతనం ఆరోజులలో బ్రాహ్మణుల కెంతయినా శ్రమ కలిగించేది. ఎంచేతంటే, ప్రొద్దున్నే లేచి, మైలబడిన వంటిల్లంతా, కడుక్కోడమే గాకుండా, ఊరగాయల కుండలతో సహా బయటపడేసి, పుణ్యాహవాచనం మొదలయిన వైదికశుద్ధి కర్మలుకూడా చేయవలసిన అవసరం వచ్చేది. ఈ కులంవాళ్ళ దొంగతనం పద్ధతిలో ఒక సుగుణం వుందని ఒప్పుకోకతప్పదు.

ఏమనగా, కష్టపడి, కన్నం వేసి, తెగించి ఒక ఇంట్లోకి జొరబడింతర్వాత కూడా, దొంగలకు మంగలంకూడా దొరక్కపోవచ్చు కాని ఈ కులంవాళ్లకు ఆ పూటకి కొంత కూడయినా దక్కేది.

నాడు దొంగతనానికి వచ్చేవాళ్ళు, చాల చాకచక్యం కలవాండ్లేగాక, ధైర్య సాహసాలు కలిగిన మేటి జవాన్లుగా ఉండేవారు. అంచేతనే రాత్రిళ్ళు వాళ్ళెదురవడంకూడా చాల ప్రమాదకరంగా ఉండేది. ఎందుకంటే అర్ధరాత్రులప్పుడు, దొంగనుచూచి తప్పించుకొని బయటపడ్డ ప్రజ్ఞావంతులను కూడా నేను నాడు చాలమందని ఎరుగుదును ఇట్టి ప్రజ్ఞావంతులు నాడు పోలీసులలో ఎక్కువగా ఉండేవారు కూడా:

## జాతః నిజాయితీ

కన్నపు దొంగతనాలకు కూడా, దొంగలు జట్లు జట్లుగా వచ్చేవారు. ఒక కన్నం వేయడానికి, కనీసం, ముగ్గురు, నలుగురు ఒక జట్టయి బయలుదేరేవారు. వాళ్ళలో కూడ అనేక నీతులున్నాయి. అందులో ముఖ్యమయిన నీతి, ఒకడు తన ప్రాణం పోయినా సరే, మిగిలినవాళ్లను బయటపెట్టకూడదు. ఒకొక్కప్పుడు, జట్టు అంతా పట్టుబడేది. కాని, ఒకొక్కప్పుడు ఒక్కడో ఇద్దరో దొరికేవాళ్ళు. నాగుప్రజకు దొంగలంటే ఎంతభయం ఉండేదో, దొరికిన దొంగలను అంత కాఠిన్యంతో వారు కనికరం ఏమీ లేక మిగిలినవాళ్ళ జాడలు చెప్పమని దొరికిన వాళ్ళను చిత్రవధచేస్తూ హింసించేవాళ్ళం జాడలు చెప్పమని దొరికినవాళ్లను చిత్రవధ చేస్తూ హింసించేవాళ్ళు అట్టివల్ల దొంగలు, పట్టుబడేదానికంటే చావే మేలని, ఆత్మహత్యకూడా చేసుకొనేవాళ్ళు.

మాచిన్నతనంలో, మా ఊరి ప్రక్కనే ఒక చిన్నగ్రామంలో ఒక చిత్రమయిన దొంగతనం జరిగింది. దొంగలజట్టు నడిరాత్రివేళ, ఒక ఇంటికి కన్నం వేశారు. ఆ యింట్లో ఉన్నవాళ్లుకూడా దొంగతనం వృత్తిగాకల కులంవాళ్ళే. గోడక్రింద నేలమట్టంగా కన్నంపొడిచి, ఒక దొంగ కన్నంలోంచి కాళ్లు ముందుకు పెట్టాడు. ఇంట్లోవాళ్ళు, అది సరిగా కనిపెటి వాడి కాళ్ళు గట్టిగా పట్టుకున్నారు. బయటవున్న జట్టులోని వాళ్ళది కనిపెట్టారు వెంటనే, కన్నంలో కాళ్లుపెట్టిన దొంగ తల కాయ కోసేసుకొని, వాళ్ళు పరారయినారు. ప్రొద్దున్నే నెత్తుటి జాడలు ఊరిబయటి చింతతోపుదాకా తెలియవచ్చాయి.

అటుతర్వాత ఆ జట్టు జాడలేవు...

అంత సాహసం, తెగింపు ఆనాడు దొంగలకుండేది. వారి విద్యనభ్యసించడం, సాధన చేయడంకూడా ఒక అద్భుతమయిన ప్రణాళికప్రకారం సాగేది. ఆ అపురూపసాధనను గూర్చి మరోవ్యాసంలో చెబుతాను. ★

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతవారం తరువాయి)

ఇద్దరు యువకులు అరుస్తూ కొట్టుకుంటున్నారు. జనంపోగయి వాళ్ళని విడదీయ ప్రయత్నిస్తున్నారు. పోలీసు పరుగెత్తుకు వచ్చాడు. ఈపోట్లాట చూచి అతడి రాకతో భయపడి ఆయువకులు ఒకరినొకరు తిట్టుకుంటూ విడిపోయారు.

వస్తాదు ఆగుంపులో దూరి సంగతి కనుక్కుని వచ్చాడు ఒక అమ్మాయిని ఒక యువకుడు అతిగా ప్రేమించి ప్రతిదినం ఆమె సాంగత్యంలో ఆనందించేవాడు. ఆ అమ్మాయి సౌందర్యం సంగతి విన్న ఆయువకుని స్నేహితు డొకడు ఒకరాత్రి ఆమెను అనుభవించాడు. అది ఆ యువకుడికి తెలిసింది. ఉదయం ఆ అమ్మాయి యింటికి యిద్దరూ ఒకరికి తెలియక ఒకరువస్తూ దారిలో ఒకరినొకరు చూచుకుని ఉద్రేకాలు ఆపుకోలేక, కొట్లాట మొదలు పెట్టారు

ఆ యువకుల నిద్దరినీ అనుభవించిన ఆ అమ్మాయి దూరంగా మేడమీదనుంచి నవ్వుతూ కొట్లాట చూస్తోంది.

వ్యభిచారవృత్తి స్వీకరించిన స్త్రీలు ధనాశతో నిజాయితీని మంచితనాన్ని చంపుకుంటారని తను విన్న సంగతి కమలకు బుజువయినట్లనిపించింది. గాని ఈగ చుట్టూ తిరిగే తేనె టీగల్లా మసిలే విటులను చూసి యౌవనము, అందమూ వున్న యువతులు గర్వంగా కొంతకాలం విర్రవీగుతారు. వారి ప్రవర్తనకు ప్రతిఫలంగా జీవితం చివరికి ఖేదమయమవుతుంది.

"సరేలే! యిటువంటి కొట్లాటలు మామూలే!" అనుకుంటూ యువతులు ఇంట్లోకి నడిచారు.

కొంతసేపు ఆస్త్రీలు కొట్లాడుకుంటున్న యువకుల అందం, బలం, పౌరుషం గురించి సరదాగా వాదోపవాదాలు చేసుకున్నారు.

ముసలిదానికి వంట ప్రయత్నంలో సాయం చేయడానికి ఇద్దరు స్త్రీలు వంటింట్లో చేరారు

ఒకతె పేక తెచ్చింది ముక్కలు కలిపింది పేకాటలో చేరింది కమల.

ఇట్టే కాలం గడిచిపోయింది.

ముసలిది భోజనానికి పిల్చింది.

కమల, మిగతా స్త్రీలు భోజనాలుచేసి ఒక కునుకుకూడా తీశారు.

మధ్యాహ్నం మూడుగంటల తర్వాత రాముడు వచ్చాడు చేతిలో ఏదోకర్ర ఊతంగా ఊపుకుంటూ.

"విన్నారా యీ సంగతి!" నటుడి భంగిమలో నిలుచున్నాడు రాముడు.

ముసలిది యువతులు, వస్తాదు కమల అందరూ అతనిచుట్టూ నాటకంలోని పాత్రల్లా మూగారు.

"ఆ ప్రక్క వీధిలో బొజ్జమ్మను హత్య చేశాడు!".

"ఎవరు?" అందరి కంఠాలు ఆశ్చర్యంగా ప్రశ్నించాయి.

"పూర్వాశ్రమంలోని భర్త!" కళ్ళు పెద్దవిచేసి, నోరు మెలికలు త్రిప్పి, గుటకలు మ్రింగుతూ మెల్లిగా చెప్పాడు రాముడు.

"అలాగా!" ప్రాణాలు ఎగిరిపోయినట్లు అందరూ గుడ్లుతేలేసి ఆశ్చర్యంగా నిలుచుండిపోయారు

బొజ్జమ్మ లేచి పోయిందట ఎవరితోనో, భర్తతో కాపురంచేసే రోజుల్లో ఆమె కోసం భర్త తెగవెదికాడట... కాని కనుపించలేదు. లేవతీసుకువచ్చినవాడు మోసం చేసిపోగా బొజ్జమ్మ యిక్కడకువచ్చి వ్యాపారంతో పొట్టగడుపుకుంటోంది. బొజ్జమ్మను యిక్కడ చూచిన వాళ్ళు ఎవరో భర్తకు చెప్పారట హేళనగా. ఆవేళ ప్రొద్దున హఠాత్తుగా కోపంగా గుమ్మంలో ప్రత్యక్షమయిన భర్తనుచూసి కొయ్యలా నిలుచుండిపోయింది బొజ్జమ్మ...కళ్ళల్లో నిప్పులు గ్రక్కుతూ, మౌనంగా కసిగా మెల్లిగా బొజ్జమ్మ దగ్గరగా వచ్చి నిలుచున్నాడు భర్త...అతని ప్రవర్తనచూసి బొజ్జమ్మ ఆశ్చర్యపోయి, అతన్ని ప్రసన్నం చేసుకోవాలని నవ్వింది...ఏనుగుమీద సింహం ఉరికినట్లు ఒక్కసారిగా పెద్ద అరుపు అరిచి ఆమెపీకపట్టాడు. మరుక్షణంలో పీక మొండానికి వేలాడింది. గాజుసిలా మారిపోయింది బొజ్జమ్మముఖం నిలువుగుడ్లు పడి. రక్తం కాల్వకట్టింది. ఆమె భర్త చేతులు, బట్టలు రక్తంతో ఎర్రబడిపోయాయి. ఆ రక్తం తీసుకుని ముఖాన బొట్టుపెట్టుకున్నాడు భర్త...రక్తంతో తడిసినబాకు విసిరేశాడు ఖులాసాగా. ఒళ్ళంతా రక్తం పూసుకుని విరగబడి నవ్వాడు. ఆ యింట్లోని స్త్రీలు భయంతో తమ గదుల్లోకి పారిపోయి తలుపులు మూసుకున్నారు. ఇంతలో పోలీసులు వచ్చారు. అతనికి సంకెళ్ళు తగిలించి తీసుకు పోయారు!!

నటుడి ధోరణిలో ఉపన్యాసమిచ్చి, అలిసిపోయి విచిత్రహావభావప్రకటనచేసి, ఆగాడు రాముడు.

రాముడి నటన అంతా చూసి "ఆ, యిటువంటి హత్యలు యీ పేటలో క్రొత్త ఏముంది?" యువతులు నీల్గారు.

కమలకు లోలోపల భయం పుట్టింది. బొజ్జమ్మ చరిత్రపోలికలు కొన్ని తనలోనూ ఉన్నాయి. ఎవరో జ్ఞప్తికివచ్చారు. అతను కనిపిస్తే.... ఈ పరిస్థితుల్లో యిక్కడ చూసి హత్యచేస్తే.... ఆ ఆలోచన ఆమె హృదయాన్ని కలతపెట్టింది. అది జరిగేటంత పనికాదని మెల్లిగా తనలో తాను సర్దుకుంది కమల.

"ఇందులో పెళ్ళయినవాళ్ళు ఎవరైనా ఉంటే తమ భర్తల్ని గురించి ఒక్కసారి జపం చేసుకోండే!" రాముడు వ్యంగ్యంగా నవ్వి, ఠీవిగా బయటికి వెళ్ళిపోయాడు.

కమల అతనివైపు ఆత్రంగా చూసింది. మరణంగురించి యువతులు ముచ్చటించారు.

"చచ్చిపోయిన బొజ్జమ్మ ఎంత అదృష్ట

## ★ అన్వేషణ ★

వంతురాలు! కటాకట్! ఒక్క దెబ్బతో ఎక్కడికో తెలియని ప్రపంచంలోకి వెళ్ళిపోయింది!" పకపక నవ్వింది ఒక యువతి.

"ఏదో కసి తీర్చుకున్నా ననుకున్నాడు కాని, బ్రతికి ఉండి బొజ్జున్న భర్త ఏం బావుకుంటాడో! కొన్నాళ్ళు జైలు.... తర్వాత పిచ్చి, తర్వాత చీడ బట్టినట్లు మంచం చావు!" మరొక యువతి చేతులు విరుచుకుంటూ సాగతీసుకుంది.

"బాధల బ్రతుకుకంటె చావు ఎంత సుఖం! హత్య చేసినవాడు దురదృష్టవంతుడు, హత్యచేయబడిన వాళ్ళే చాలా అదృష్టవంతులు! ............... నన్ను తక్షణం ఎవరైనా చంపేస్తే ఎంత బాగుంటుంది!" మరొకతె లీలగా చావుల ప్రపంచాన్ని గూర్చి శోకగానం చేసింది.

ఒకతె చెంబాడు తెచ్చి ఆమె పీకకు చుట్టి బిగించింది. తక్కినవాళ్ళు నవ్వారు. కళ్ళు తేలేసినట్లు నటించి కూలబడింది ఆమె. ముసలిది కాఫీ తేవడం చూచి, కూర్చుంది ఆమె.

"అమృతం లాంటి కాఫీ ప్రపంచంలో దొరుకుతుంటే నీకూ నాకూ చావు ఎలా వస్తుంది!" ఒక స్త్రీ వేళాకోళం చేసింది.

బ్రతుకు బాధల బడబాగ్నిని గుండెల్లో దాచుకుంటూ, నీచ కులటవృత్తిలో పా పోషించుకుంటూ, కృత్రిమ ఆనందంతో, నిర్లక్ష్యంగా జీవితాలు గడుపుతున్న ఆ స్త్రీలు కమలకు చాలా విచిత్రంగా కనిపించారు. నీచమైన వృత్తి చేపట్టినంతమాత్రాన వాళ్ళలో పూర్తిగా దుర్మార్గలక్షణాలు మూర్తీభవించాయని నిర్ణయించడం కష్టంగా కనిపించింది కమలకు.

"కమలా! ముఖం కడుక్కొని, తల దువ్వుకో!" ముసలిది ఆజ్ఞ చేసింది.

"క్రొత్త! గట్టిగా ఝడిపించకు! ఒకతె ముసలిదాని బుజంతట్టి జాలిగా చూసింది కమలవైపు. "జడవెయ్యనా!" అంటూ ముందుకు వచ్చింది. కమల మౌనంగా అంగీకరించింది. ఆమె నూనెరాసి ముడివేసింది.

"డాబామీదకు వెడదామా!" కమల నడిగింది ఆ యువతి.

"నీ పేరు?"

"బాలమ్మ!"

కుళాయి చప్టా మీద కుండ పెంకులో మట్టితో నల్లబడిన లక్సు సబ్బుతో ముఖం రుద్దుకుంది కమల.

మల్లెపూలు నాల్గు దండలు తెచ్చి మామూలుగా యింట్లో పడేశాడు ఒకగుకొండారు.

ముసలిది తెచ్చి మల్లెపూవులు అందరి తలల్లో గుచ్చింది.

బాలమ్మ కమల డాబామీదకు వెళ్ళారు. దుమ్ముపట్టి, ఎగుడు దిగుడుల సిమెంటు గతుకులతో, మట్టిలోంచి పొడుచుకువచ్చే గడ్డి మొలకలతో సగం సగం పడిపోయిన కర్ర కమ్మీలతో, ఆ డాబా ఆ శిథిలమైన కొంపకు, అందులో బ్రతుకుతున్న చితికిన జీవితాలకు అనుగుణంగానే ఉంది. డాబా మీదనుంచి క్రిందికి చూచింది కమల. కిళ్ళీ దుకాణాలవద్ద జనం గుంపులుగా నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు. సిగరెట్టు పొగలు వదులుతూ ప్రక్కనున్న యిళ్ళవైపు, యిళ్ళ గుమ్మంలో నిలుచున్న స్త్రీలవైపు ఓర చూపులు చూస్తూ తమలో తాము నవ్వుకుంటూ పొగరుబోతుగా యువకులు నడిచిపోతున్నారు. అక్కడక్కడ చెదిరి నిలుచున్న బ్రోకర్లు కులాసాగా, నీటుగా, ఓరగా నడుస్తున్న యువకులను పసికట్టిచూచి "బాబూ! కావాలా" అంటూ నడిచి, ఆగి, నిర్భయంగా ప్రశ్నిస్తున్నారు. తెరలు కట్టిన రిక్షాలు మువ్వల శబ్దంతో ఎత్తుపల్లాల ఆ సిమెంటు రోడ్డుమీద చదరంగంలోని పావికల్లా రహస్యమైన ఎత్తులతో కదులుతున్నాయి.

వీధిలోని విద్యుద్దీపాలు మసకగా నలిగాయి కులటల కులుకుల్లా. మల్లె [illegible] తొడుక్కున్న ఒక నల్లటియువకుడు గబ్బిలాలా లావెక్కి ఉన్న మరొకడు ఒక బ్రోకరుని పిలిచి డాబాక్రింద గుసగుసలాడుతున్నారు. ఎదురుగాఉన్న మేడ మీద వాయిద్యాల శ్రుతులు గాలిలో తేలి కమల వీనుల్లో ఊగాయి. మువ్వల శబ్దాలతో కలిసి వెలువడుతున్న రాగాలు నృత్య ప్రదర్శనలు జరుగుతున్నట్లు స్పష్టం చేస్తున్నాయి.

ఒక బట్టతల తాతగారు వెంటబడిన బ్రోకరును కసిరి కొట్టాడు. ఒక యువకుడు రెండు రూపాయిల కాగితాలు ఒక బ్రోకరుకు అందిస్తున్నాడు. ఎదురుగా ఉన్న యింట్లో ఇద్దరు యువకులు చొరబడ్డారు. వీధి గుమ్మంలో నిలుచున్న స్త్రీలు పురుషుల విషయం వాంఛలు క్రూరంగా మార్చేసిన వికృత స్వరూపాలకు కృత్రిమపు టందాలు పూసుకొని బలవంతంగా తెచ్చుకున్న నవ్వులతో ఒయ్యారంగా నిలుచుని పసికట్టిన విటులను పిలుస్తున్నారు. కాకీదుస్తుల ఎర్రటోపీ మనిషి లాటీ పట్టుకుని శృంగాటకంలో గస్తీ కాస్తున్నాడు. కలాటాలు జరగకుండా. మోటారుసైకిలు మీద పరుగెత్తిన ఒక కాకీదుస్తుల అధికారి ఒక గుమ్మంముందు నిలుచున్న స్త్రీని చూసి నవ్వుతూ గాలిలో తేలిగ్గా ఒక ముద్దు విసిరాడు.

"నాకు భయం వేస్తోంది బాలమ్మా!" కమల బాలమ్మ బుజంమీద చెయ్యి వేసింది.

"క్రొత్తలో అలాగే వుంటుందిలే!" బాలమ్మ తేలిగ్గా నవ్వేసింది కమల ముఖం చూస్తుండా. తర్వాత కమల వదనంలోని భయం చూచి జాలిపడింది బాలమ్మ.

"నీకు యీ జీవితం యిష్టం లేకపోతే వెళ్ళిపో యిక్కడనుంచి దొంగతనంగా!— యీ జీవితాలు నాశనమైపోయాయి...నాశనం చేశారనే కోపంతో, మగపురుషులపై కసి తీర్చుకోడానికి యీ బ్రతుకు బ్రతుకుతున్నా...నా అనారోగ్యం అందమైన భార్యలను మోసంచేసి ధనమదంతో యిక్కడ అడుగు పెట్టిన ప్రతిమగవాడికి ఒక గుణపాఠం చెబుతూంది. పగబట్టిన త్రాచులా ఆడదాన్ని అన్యాయంచేసే మగసంఘంపై కొట్లువేసిన శరీరాలను విషకలుషితం చేస్తేనే నా మనస్సుకు శాంతి. చితికిపోయిన జీవితాన్ని బాగుచెయ్యడం కష్టం—ఎప్పుడో చితిఎక్కి నుసియైపోతుంది. ఆ కాలం ఎంత త్వరగా వస్తే అంత మంచిది!!"

బాలమ్మ చూపులు భయంకరంగా మారి, కన్నుగుడ్లు ఎర్రబడ్డాయి!

"ఎల్లాగ పారిపోవడం?"

"నేను సాయం చెయ్యనా?"

"ఊఁ!"

"మరి యీ రాత్రి ఎలాగ గడుపుతావు.. ముసలిది ఊరుకోదు. విటులను తోలుతుంది నీమీదికి..."

"ఏం చెయ్యమంటావు?"

"అల్లరిచెయ్యి...దగ్గరికి రానీయకు!... ఏంజరిగినా విచారించకు...శీలం చెడగొట్టుకోకు...తెల్లవారుఝామున నిన్ను యింట్లోంచి పంపేసే ఏర్పాటు నే చేస్తా!"

బాలమ్మ మాటలతో కమల ఆనందం పట్టలేకపోయింది. వృత్తివల్ల నీచగుణంవున్నా హృదయంలో ఔదార్యంవున్న బాలమ్మ కమలకు దేవతలా కనిపించింది. మనిషి శీలాన్ని బట్టి మనస్సును అపార్థం చేసుకోకూడదనుకుంది కమల. ఒక్క గెంతుగెంతి సంతోషంతో బాలమ్మను గాఢంగా చేతులతో బంధించింది.

"రాముడు కూడా సాయం చేస్తానన్నాడు...!"

"వాడిమాటలు నమ్మకు...ఎంతకైన మగపురుగు!"

క్రూరంగా నవ్వింది బాలమ్మ.

రాముడికోసం వీధిలోకివెళ్ళి కళ్లు పెద్దవిచేసి పరిశీలించింది కమల. ఎక్కడా కనిపించలేదు అతను. బాలమ్మ మాటల్లోని అంతరార్థం కొంత నిజంకావచ్చునని అనుమానపడింది కమల.

శృంగాటకంలోని ఇరానీ హోటల్లోని రేడియో హిందీపాటలు విసురుతోంది. విషయవాంఛాతృప్తి తరువాత నీరసదేహాలతో తూలుతున్న యువకులు హోటల్లో దూరి టీ సేవిస్తున్నారు. బూంది, పకోడీలు, మిరపబజ్జీలు అమ్మేబండి గాసులైటుతో శృంగాటకములో నిలుచుంది. బేరాల ఊపుకు తట్టుకోలేని ఆ బండివాడు ఆయాసంగా గబగబ పొట్లాలు కడుతున్నాడు.

చీకటి బాగా అలుముకుంది. ఆ చీకటిని ఛేదించే విద్యుద్దీప స్తంభాల నీడల్లో వారకాంతలు వరసగా నిలబడ్డారు.

ముసలిది గట్టిగా పిలిచింది బాలమ్మను.

కమల బాలమ్మను అనుసరించి క్రిందకు వచ్చింది. గళ్ళలుంగీ సాహెబు ముసలిదాని చెవిలో ఏదో ఊదాడు. ముసలిది దగ్గరకు వెళ్ళి కమలనుకూడా లోపలికి నెట్టింది.

మల్లులాల్చీ యువకుడు, రుబ్బురోలులాంటి బొద్దుమనిషి గదిలో మంచంమీద కూర్చున్నారు. గళ్ళలుంగీ సాహెబు గడ్డాన్ని వేలాడేస్తూ అతివినయంగా నిలుచున్నాడు వాళ్ళ ప్రక్కనే. యువతులు, పెళ్ళిపందిరిలో స్తంభాల్లా నిశ్చలంగా నిలుచున్నారు.

భయంతో బాలమ్మవెనక దాగొన్న కమలవైపు కులుకుతూ చూశాడు బొద్దుమనిషి.

"ఏంపిల్లా!"రుబ్బురోలులావున్న కోమటాయన నవ్వాడు ముఖం చిట్లించి. నల్ల యువకుడు అలవాటైన రీతిలో బాలమ్మను చెయ్యిపట్టుకు లాగాడు.

తక్కిన స్త్రీలు గదిలోంచి తరలిపోయారు. సాహెబు చేతిలో పదిరూపాయిలనోట్లు పడ్డాయి. కమల భయంగా బయటకి నడిచింది.

'వెళ్ళిపోతుందేమిటి?' "కోమటి తమాషాగా బిక్క ముఖంతో అరిచాడు.

'ఎక్కడికిపోతుంది! "బాలమ్మ, కోమటి స్వరంతోనె రాగం తీసింది హేళనగా.

మల్లులాల్చీ నల్లయువకుడు పకపక నవ్వాడు. బాలమ్మ చెయ్యి పుచ్చుకొని నల్లయువకుణ్ణి తడికల గదిలోకి లాక్కుపోయింది. దారిలో నిలుచున్న కమల చెవిలో ఏదో గొణిగి నవ్వింది బాలమ్మ. గళ్ళలుంగీ సాహెబు కొంటె చూపుతో అంతా పరిశీలించాడు. ముసలిదాన్ని పిలిచాడు. ముసలిది తాంబూలం నములుతూ కమల భుజంమీద చెయ్యివేసింది.

'పిచ్చిపిల్లా! లక్షాధికారి కోరుతున్నాడే యీ వేళ నిన్ను! సంతోషపెడితే, స్వర్గం కనిపిస్తుంది యీ భూలోకంలో!" కమల వెక్కి వెక్కి ఏడ్చింది.

ముసలిది కమల చెయ్యిపట్టుకుని కోమటి కూర్చున్న గదిలోకి బలవంతంగా త్రోసి తలుపు బిగించింది.

భయంగా లేడి పిల్లలా గదిలో ఒకమూల జరిగి నిలుచుంది కమల.

'నన్ను చూసే భయమెందుకే పిల్లా!" కదులుతున్న మర్రి చెట్టులా కనిపించాడు కోమటి.

'నాదగ్గరికి రాకు!" అరిచింది కమల.

'అబ్బ! ఏంతమాషా!" కోమటికులికాడు.

'నేను మంచిదాన్ని కాను!"

'అందుకేకదూ, నేవచ్చింది!"

'నాలో నానా రోగాలు ఉన్నాయి!"

'భయంలేదు. నవ్వుబలే అందంగా ఉన్నావు!"

కుంభంలాంటి బొజ్జతో కురిడీలా, గుండ్రంగా, నున్నగా ఉన్న కోమటి కమలను ఆలింగనం చేసుకోబోయాడు. కమల కోపంతో కోమటిని తన్నింది.

"ఏంటే! పొగరు!" మొద్దుతుట్ట పెదిమల మధ్యనుంచి నాలిక పైకిలాగి కూర్చున్నాడు కోమటి కోపంగా.

'తన్నులు తినడానికి యిచ్చానా పది రూపాయలు! కోమటి రైలు ఇంజనులా గుప్పుమనే పౌరుషంతో కమలమీదకు విసురుగా వచ్చి బలవంతంగా చేతుల్లో బంధించాడు. కమలకు ఏంచేయాలో అర్థంకాక, కోమటి చెయ్యి గట్టిగా కరిచింది.

"అయ్యోయి!" కోమటి చచ్చిపోతున్న రాక్షసుడిలా ఘోరంగా కేకపెట్టాడు. ముసలిది, గళ్లలుంగిసాహెబు, గదితలుపు తెరిచారు. కమల విసురుగా ఏడుస్తూ బయటికి వచ్చేసింది.

(ఇంకా వుంది)



# ఆంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - సప్తమాశ్వాసము

మత్తకోకిలము. మానితం బగునాతపోమహిమం ద్రిలోకపరాభవం
బేను జేయఁగఁ బూని చేసితి నిట్టి దొక్క ప్రతిజ్ఞ మున్
దీని నెట్టులు గ్రమ్మఱింతు మదీయభాషిత మెన్నఁడు
న్నేని మోఘము గాదు దిగ్ధరణీరవీందు లెఱుంగఁగాన్.

క. మతి ఘటించి యని స్తీర్ణ ప్రతిజ్ఞుఁ డగువానికోప పటుదహన మని
ర్గత మయి వడి నరణిసము, త్థితదహనముపోలె నాత్మదేహము నేర్చున్.

క. అలయక నిమిత్తజం బగు, నలుకను క్షమియించి శాంతుఁ డగుపురుషుం డి
మ్ముల రక్షింపఁగ నోపును, పొలుపుగ ధర్మార్థకామ ములు సమములుగాన్.

తే పాపులై క్షత్రియాధముల్ భార్గవులకు, నట్లుహింసగావించునాఁ డార్తనాద
మూరుగర్భగతుండనై యుండి వినిన, నాఁడ కోప మసహ్యమై నన్నుఁబొందె.

తే. ఎఱుక గలఁ డేని మఱి శక్తుఁ డేని యన్యు, లన్యులకు హింసగావించునపుడదానిఁ
బూని వారింప కున్న నప్పురుషుఁ డేఁగు, హింస సేసినవారల యేఁగుగతికి.

వ. కావున లోకంబులయందు సామర్థ్యంబుగలిగి పాపప్రతిషేధంబు సేయనివారల నుద్దేశించి యలిగితి నేనును నం బతిక్రమింప నోడుదు నఖిలలోకదహనోద్యతంబయిన నాకోపదహనంబు నిగృహీతంబయిన నన్ను దహించు నేమిసేయువాఁడ మీరు సర్వలోకహితులరు నాకును లోకంబులకును హితం బగునట్లుగా నుపదేశింపుఁ డనిన నౌర్వునకుం బితరు లిట్లనిరి.

ఆ. జలములంద యుండు సర్వలోకంబులు, గాన నీమహోగ్ర కలుషవహ్ని
జలధిలోన విడిచి సత్యప్రతిజ్ఞుండ, వగుము జలధిజలము నది దహించు.

వ. అనిన నౌర్వుండు పితృదేవతాదేశంబునఁ దనకోపానలంబు సముద్రంబులో వైచిన నది యౌర్వానలంబు నా వశ్వముఖంబున నబ్ధిజలంబులు ద్రావుచుండు నిది వేదంబులయందు వినంబడియెడుకథ గావున నీవును నౌర్వునట్ల ధర్మవిదుండవు భువనపరిభావి యైన యీక్రోధంబు విడుచుమనిన వసిష్ఠువచనంబునం బరాశరుండు గోపం బుపసంహరించి రాక్షసవినాశనార్థంబుగా సత్త్రయాగంబు సేయంగడంగిన.

తే. శక్తి రాక్షసనిహతుఁడై చనిన శోక, దహనహతుఁడై వసిష్ఠుండు దానిఁ దలఁచి
కడుఁ బ్రశాంతాత్ముఁ డయ్యు రాక్షసవినాశ, మొలసి మునుమనివారింపకుండెనంత

క. ఘోరాకారులు కృతహా, హారవులు సబాలవృద్ధు లయి పడిరి దురా
చారులు రాక్షసులు ముని, ప్రారబ్ధాధ్వరసమిద్ధ పావక శిఖలన్.

వ. ఇట్లు పరాశరుండు గావించు సత్త్రయాగంబునన్నైన రాక్షసకులప్రళయంబుఁ జూచి పులస్త్యపులహక్రతువులు మహామునిసంఘంబుతో వసిష్ఠాశ్రమంబునకు వచ్చి.

క. అగ్నిహతిఁ జేసి మానవ, భుగ్నివహము మరణబాధఁ బొందించుచు మాఁ
దగ్నులయొద్దను నాలవ, యగ్ని యనఁగ వెలుఁగుచున్న యమ్మునినాథున్.

క. పరమతపోనిలయుఁ డిట్లే, శ్వరదీప్తిసహస్రతేజు శాక్తేయుఁ బరా
శరుఁ గని యందఱుఁ బ్రార్థించిరి రాక్షసమారణంబు సేయకు మనుచున్.

వ. పరాశరుండును బులస్త్యాదిమహామునిప్రార్థితుండై రాక్షససత్త్రయాగం బుపసంహరించి తన్నియోగంబున నయ్యగ్ని హిమవదుత్తరపార్శ్వంబునఁ బైచిన నదియును బర్వంబుల నందు వృక్షరాక్షసశిలాభక్షణంబు సేయుచుండెనని యిట్లు గంధర్వుండు తాపత్యవసిష్ఠౌర్వోపాఖ్యానంబు సెప్పిన విని యర్జునుండు వానికిట్లనియె.

ఉ. మాకు నతిప్రియుండవు సమస్తవిదుండవు చెప్పుమయ్య యీ
లోకములోన వర్తనము లుండఁగు వారి నెఱుంగు దివ్వని
న్ప్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండు గాఁ
జేకొనువార మట్టిబుధసేవితుఁ గానఁగ మాకు నెందగున్.

వ. అనిన గంధర్వుండు పెద్దయుంబ్రొద్దు విచారించి యిచ్చోటికిం గుఱంగట నుత్కచం బను పుణ్యతీర్థంబునం దపంబు సేయుచున్నవాఁడు ధౌమ్యుండను బ్రాహ్మణుని బురోహితుఁగాఁ బ్రార్థింపుం డమ్మహాత్ముండు మీకుఁ బురోహితుండైన సర్వార్థసిద్ధి యగుననిన సంతసిల్లి వానికి నాగ్నేయాస్త్రంబు విధ్యుక్తంబుగా నిచ్చి మాకు నీయిచ్చినహయంబులు నీయంద సంగ్రహించి యుండుము ప్రయోజనంబు గలనాఁడు గొనిపోయెద మని గంధర్వు వీడ్కొని పాండవులు భాగీరథి నుత్తరించి యుత్కచం బనుపుణ్యతీర్థంబున కరిగి యందు.

## పాండవులు ధౌమ్యునిఁ బురోహితుఁగా వరించుట

ఉ. వీతసమస్తదోషుఁ డయి వేడ్కఁ దపం బొనరించుచున్న వి
ఖ్యాతుఁ బురోహితప్రవరుఁ గా వరియించిరి భక్తితో జగ
త్పూతచరిత్రు సాధుజనపూజితధార్మికు ధౌమ్యు దేవల
భ్రాత్ప్రవరుం మహాత్ము హితభావను భూసురవంశభూషణున్.

వ. అధౌమ్యుండును వారి నతిప్రీతిం బూజించి పురోహితత్వంబుఁ బ్రతిగ్రహించె నట్లు తేజోరూపబుద్ధివిభవంబుల బృహస్పతిసదృశుండై వేదవేదాంగవిదుండైన ధౌమ్యుం బురోహితుంగాఁ బడసి పాండవు లశేషమహీరాజ్యంబు వడసినంతయు సంతసిల్లి తత్కృతస్వస్త్యయనులయి జననీసహితంబు దక్షిణపాంచాలంబున కరుగువారు ముందఱ ద్రుపదుపురంబునకుఁ బోవు బ్రాహ్మణులం గని మీ రెందులకుం బోయెదరని యడిగిన వారిట్లనిరి.

సీ. యజ్ఞసేనప్రభు యజ్ఞమహావేదిఁ, గవచశరాసన ఖడ్గబాణ
రథయుక్తుఁడై మహారథుఁడు ధృష్టద్యుమ్నుఁ, డెవ నుదయించిన నతనితోడ
నొక్కటఁ బుట్టిన యక్కన్యకను గృష్ణ, నసితోత్పలశ్యామలామలాంగి
మెఱుపునుఁబోలెను వలులు నుత్పలగంధి, బంధురతను సౌరభంబు గలుగు

ఆ. దాని ద్రుపదరాజతనయఁ దదీయస్వయంవరోత్సవంబు నపుడు సూడఁ
గనిన వారు దృష్టిగనినఫలం బెల్లఁ, గనినవారు పరమకౌతుకమున.

వ. అట్టిమహోత్సవంబు సూడ ద్రుపదుపురంబునకుం బోయెద మింతులకు నుత్సవదర్శనోత్సుకులై దర్శనీయులుం దరుణులును నపారభూరిదక్షిణయజ్ఞ కరులును ననేకశస్త్రాస్త్రవిదులును నయిన నానాదేశాధిపతులు నింతకుఁ జనుదెంతురనంతధనంబును బ్రాహ్మణులకు వారిత్తురట్టి మీరును వారిఁ జూడ వచ్చెదరేని యొక్కటఁ బోదము రండు.

క. మీ రాయం దీకృష్ణ నుదంచ, సాయతభుజుఁ జూచి తొన హర్షముతోడం
దోయజముఖి వరియించును, మీరాయోగితన కార్య మిది సమంజసబుద్ధిన్.

వ. అని మాటలాడుచు వచ్చు బ్రాహ్మణులతోడఁ బాండవులు ద్రుపదుపురంబున కరుగువారెదుర.

క. కృష్ణమృగాజినధరుఁ దపు, ఃఉన్నద్యుతి తేజుఁ బంకజోద్భవసదృశుం
గృష్ణద్వైపాయను గతకృష్ణామయుఁ గాంచి నరుగుదెంచుమహాత్మున్.

వ. కని వినయమ్మున నమ్మునీంద్రునకు నమస్కరించి కృతాంజలులై యున్నవారికి హృదయానందంబుగా సత్యవతీనందనుం డాగామిశుభంబు లావేదించి చనినఁ బాండవులును గతిపయదినంబులకు ద్రుపదుపురంబు సొచ్చి నాలుగు సముద్రంబులంబోలె ఘూర్ణిల్లిపోయుచుం బురంబునాలుదిక్కుల విడిసియున్న నానాదేశాగత మహీనాథుల బహువిధస్కంధావారంబులఁ జూచుచుం జని యొక్క కుంభకారగృహంబున విడిసి తమ్మెవ్వరు నెఱుంగకుండ బ్రాహ్మణవృత్తి నుండునంతఁ బాంచాలపతి పార్థునకుఁ గూఁతు నీ దమకట్టి పాండవుల నన్వేషించి యుండునుం గావక.



# ఏనుగుల రాయి

సి.రామచంద్రరావు

కొత్త దొర వైఖరి ఇంకా తంగముత్తుకి అంతుపట్టలేదు. దొరలు తనకేమీ కొత్తగాదు. ఇరవై ఏళ్ల నుంచీ 'ప్రాస్పెక్ట్ టీ ఎస్టేటు' కండక్టరుగా పనిచేస్తున్నాడు. ఇప్పటికి ఎనమండుగురు మేనేజర్లనైనా చూశాడు. అంతా తెల్లదొరలే. అయితే వాళ్లంతా ఒకెత్తు, సిమ్మన్సుదొర ఒకెత్తు. వచ్చి ఇంకా పట్టుమని పదిరోజులైనా కాలేదు, అప్పుడే ఎస్టేటంతా చెడతిరిగేశాడు. అన్నివిషయాలూ క్షుణ్ణంగా తెలుసుకున్నాడు. వచ్చే ఏడాది టీనాటబోయే స్థలంకోసం ఇప్పటినుంచీ వెతుకుతున్నాడు. మునుపటి దొరలంతా వచ్చిన నెలా రెండునెలలకి కాని కార్యరంగంలో దూకేవారు కారు. నెల్లాళ్లు బదిలీఅయిన దొర నుంచి ఎస్టేటు వ్యవహారాలు తెలుసుకోడంలోనూ, ఛార్జి పుచ్చుకోడంలోనూ గడిచిపోయేవి. తరవాత కొన్నాళ్లు ఇరుగు పొరుగు మేనేజర్లని కలుసుకోడం, క్లబ్బులకి వెళ్లిరావడం, పార్టీలూ, డాన్సులూ. ఆపైన అలసట తీర్చుకోడం. సిమ్మన్సు దొరకివేమీ పట్టినట్టు లేదు. నోట్లో ఒక "పైప్" ఉంటేచాలు. ఎండనక వాననక ఎంత పనైనా చేసుకుపోతాడు. దొర పనిసమయంలో పైపుకాల్చడం తంగముత్తుకి నచ్చలేదు. ఇంతకు ముందున్న దొరలు ఎస్టేటులో పని తనిఖీచెయ్యడానికి వచ్చినప్పుడు సిగరెట్టు పైపు మొదలైనవేవీ కాల్చేవారు కాదు. ఒకరిద్దరు

# ★ ఏనుగులరాయి ★

అలా చెయ్యడం తప్పని చెప్పినట్టు కూడా తంగముత్తుకి జ్ఞాపకం. సిమ్మన్సు దొర అన్నిటిలోనూ వ్యతిరేకమే. ఎస్టేటు కూలీలని నవ్వుతూ పలకరిస్తాడు. ఎప్పుడు పడితే అప్పుడు వాళ్ళగోడు వింటాడు, సానుభూతి చూపిస్తాడు. కండక్టర్లతోనూ అసిస్టెంటు కండక్టరతోనూ స్నేహంగా కబుర్లు చెబుతాడు. పాతదొరలు ఎప్పుడూ తంగముత్తుతో కాని, తన అసిస్టెంటుతో కాని ఎస్టేటు వ్యవహారాలు తప్ప ఇంకేమీ మాట్లాడలేదు. సిమ్మన్సుదొర కలుపుగోలుతనం తంగముత్తుని కలవర పెట్టింది. ఇలా ఉంటే కూలీలని కంట్రోలని అదుపులో పెట్టగలడా? తంగముత్తు, అలవాటులేని ప్రతి విషయాన్నీ అనుమానంగా చూస్తాడు. కొత్త దొర ప్రవర్తన అతనికి సంతోషం కలిగించవలసినప్పటికీ తనలో జీర్ణించిపోయిన పాత దొరల సంప్రదాయంతో సంఘర్షణపడి అతన్ని దీర్ఘాలోచనలో ముంచింది.

"ఈ తోట నాటిన టీ ఇక్కణ్ణుంచి ప్రారంభమవుతుందనుకుంటాను?"

దొర ప్రశ్న, వెనక నడుస్తున్న తంగముత్తుని తిరిగి పరిసరాల్లోకి లాగింది.

"ఔను, సార్."

తంగముత్తు కుడిచెయ్యి అనుకోకుండా ఖాకీటోపీమీదికి పోయింది. ఎక్కువ అణకువ ప్రదర్శించేటప్పుడు కొంచెం వంగి టోపీ చివరిని కుడిచేతి మునివేళ్ళతో ముందుకు వంచి వదిలేయడం అతనికి అలవాటు.

"ఎప్పుడు నాటారు?" సిమ్మన్స దొర అడిగాడు.

"పోయిన ఏడాది సార్."

"ఎన్ని ఎకరాలు?"

"ఇరవై సార్".

"ఒచ్చే ఏడాది ఎన్ని ఎకరాలు నాటడానికి పర్మిట్ ఉంది?"

"ఇరవై అయిదు సార్."

కొంతదూరం ఇద్దరూ మాట్లాడకుండా నడిచిపోయారు. ముందు దొరా వెనక తంగముత్తూ ఒకరు తెలుపూ, ఇంకొకరు నలుపూ.



దొరనోట్లో పైపు ఉంది. నడకలో ఠీవిగా ఉంది. మాటల్లో దర్పం ఉంది. తంగముత్తు నడకలో నమ్రత ఉట్టిపడుతూ ఉంది. దొర నోట్లోంచి ఏమాట ఊడిపడుతుందోనని ఆతురతగా కనిపెట్టుకుని ఉన్నాడు. ఇద్దరూ తెల్లచొక్కా ఖాకీలాగూ, మోకాళ్ళవరకు ఖాకీ మేజోళ్లూ పాదాలకి ఇనపమేకులుకొట్టిన బూట్లూ తొడుక్కున్నారు. ఎండకి నెత్తిమీద గట్టిగా ఖాకీ టోపీ పెట్టుకున్నారు.

రోడ్డు ఇంకా బాగా పడలేదు. చాలా ముటుకు ఎస్టేటులో రోడ్లు తారు వేసినవే. మిగతావి తారువి కాకపోయినా బాగా కంకరతో దిమిశాకొట్టి వేసినవి. ఈరోడ్డు గతసంవత్సరంలో అడవి నరికి టీ నాటినప్పుడు వేసింది. ఇప్పుడు మనుషులు నడవడానికి, అడివి నరికినప్పుడు సేకరించిన కలపనీ పుల్లల్నీ ఫేక్టరీకి చేరవేసే లారీలూ ట్రాక్టర్లూ పోడానికి సదుపాయంగా ఉంది. ఇంకా మేనేజర్లూ అసిస్టెంట్, మేనేజర్లూ కార్లు తీసుకుపోవడానికి అనువుగా లేదు.

మేనేజరూ కండక్టరూ రావడం చూసి, రోడ్డుకి రెండువైపులా కొండవాలుమీద ఉన్న కూలీలు పనివేగం హెచ్చించారు. మేస్త్రీలు గొంతుచించుకుని బాగా పని చెయ్యమని కూలీలని హెచ్చరించడం మొదలు పెట్టారు. వంగిపని చేస్తున్న కూలీలూ మేస్త్రీలూ, అప్పుడప్పుడు తలఎత్తి దొరకి కండక్టరికి సలాములు పెట్టారు. దొర బుర్ర పంకించి అందుకున్నాడు. దొరపక్కని ఉండడంవల్ల కండక్టరు యథాప్రకారం తిరుగు సలాం పెట్టి వారిని పలకరించలేదు.

"నిరుడు నాటినచెట్లు బాగానే వస్తున్నట్టున్నాయి" సిమ్మన్సుదొర అన్నాడు.

"అవును సార్."

"నేల సారవంతమైందిలా వుంది."

"ఔను సార్."

"కొండవాలు అంతనిటారుగా కూడా లేదు. అది కూలీలు టీ ఆకులు తుంపడానికి కష్టపడి ఎక్కిదిగనక్కర్లేదు."

"అవును సార్."

ఎంతో అవసరం ఉంటేగాని మేనేజర్ల ప్రశ్నలకి అంతకంటే ఎక్కువ జవాబు చెప్పే అలవాటులేదు తంగముత్తుకి. మేనేజరుకి నవ్వొచ్చింది.

"ఇంకా కొండ ఎన్ని ఎకరాలుంటుంది"

"వంద ఉండొచ్చు సార్".

"అంతా మనకంపెనీదేనా?"

"అవును సార్."

"మెక్ నాటన్ టీ కంపెనీకి ఏనమలై కొండల్లో ఏడు ఎస్టేట్లున్నాయి. ఒక్కొక్క ఎస్టేటు విస్తీర్ణం వెయ్యి ఎకరాల నుంచి రెండువేల ఎకరాలవరకూ ఉంది. అయితే ఎస్టేటుకి చెందిన అన్ని ఎకరాల్లోనూ టీ నాటలేదు. ఒక్కొక్క ఎస్టేటుకీ అయిదువందలనుంచి వెయ్యి పన్నెండు వందల ఎకరాలదాకా పంటనిస్తున్న టీ ఉంది. మిగతా అడవి. ఈ అడవిని ఏడాదికి రెండేళ్ళకి ఇరవై ముప్ఫై ఎకరాలచొప్పున నరికి టీ నాటుతారు. అది ఏపుగా ఎదిగి ఏళ్ళల్లో పెద్దదయి రెండాకులూ చొప్పున ఒకమొగ్గా చొప్పున తుంపడానికి సిద్ధంగా ఉంటుంది. 'ప్రాస్పెక్టు ఎస్టేటు'కి ఏడాదికి ఇరవై అయిదు ఎకరాలఅడవికొట్టి టీ నాటడానికి పర్మిట్ ఉంది. ఎస్టేటుకి చెందిన ఎనిమిదివందల ఎకరాల అడవిలో ఇరవై అయిదు ఎకరాల గడ్డని ఎక్కడఎన్నుకుంటే బాగుంటుందో పరిశీలించడానికే మేనేజరూ కండక్టరూ బయలుదేరారు.

"ఈ కొండ ఇంకా వంద ఎకరాలుంటుం దంటున్నావు కాబట్టి ఈసారి కొండకి అటువైపు అడివినరికి టీ వేస్తే బాగుంటుంది" అన్నాడు సిమ్మన్సుదొర.

తంగముత్తు "అవును సార్" అనలేదు కాని, "కాని......" అని నసిగాడు.

"నీ అభ్యంతరం ఏమిటి?" అని అడిగాడు దొర.

"ఏమీ లేదు సార్, కాని........"

"ఏమిటో చెప్పు" రెట్టించాడు సిమ్మన్సుదొర.

"ఆ కొండమీద టీ నర్సరీ పెంచడం కుదరదు సార్" అన్నాడు తంగముత్తు.

అడివినరికి టీమొక్కలు నాటడానికి ఒక ఏడాది ముందునుంచీ టీ నర్సరీలు పెంచుతూ రావాలి. దళ్లని పందిర్లకింద మెత్తటి ఇసుకలో టీ విత్తనాలు పాతుతారు. పాతిన రెండుమూడు వారాల్లో అవిపగిలి చిన్న మొలకలు బయల్దేరతాయి. అప్పుడు వాటిని తీసి తొమ్మిదిఅంగుళాల పొడుగూ మూడు అంగుళాల వెడల్పూఉన్న వెదురుబుట్టల్లో పాతుతారు. అవి అయిదారు అంగుళాలఎత్తు పెరిగినతర్వాత పక్షనిమిది అంగుళాల బుట్టల్లోకి మారుస్తారు. వర్షాకాలం ప్రారంభంలో వాటిని కొత్తగా అడివినరికి బాగుచేసిన భూమిలో పాతుతారు. ఇలా మొక్కల్ని పాతేముందు సాకుతూరావడానికి దగ్గర్లో నేలా మంచినీటివసతీ కావాలి. ఈ నర్సరీలు

మొక్కల్ని పాతబోయేస్థలానికి ఎంత దగ్గరలో ఉంటే అంతమంచిది. లేకపోతే ఒక్కొక్కటిగా బుట్టల్ని మోసుకుపోవడం విపరీతమైనఖర్చు. అక్కడ నర్సరీ పెంచడం కుదరదని చెప్పినప్పుడు తంగముత్తు బుర్రలో ఇవన్నీ మెదిలాయి.

"ఏంచేశ? కొంచెం ఆవైపు నాటేవసతి లేదా?" అని అడిగాడు సిమ్మన్నదొర.

"ఒక్కచోట ఉంది సార్."

"అక్కడే భూమి చదునుచేస్తే సరిపోతుందిగా!"

"అదికాదు సార్."

"ఇంకేమిటి?"

"అది టీ నాటడానికి మంచి స్థలం అని పదేళ్ళక్రితమే సీవెన్సు దొర నిర్ణయించి నర్సరీ ఏర్పాటు చేశారుసార్."

"అయితే ఎందుకు వదిలేశారు?"

"అక్కడ ఏనుగులరాయి ఉంది సార్. అప్పుడప్పుడూ ఏనుగులు వచ్చిపోతూ ఉంటాయి."

"అడవి కొట్టేస్తే అవే దూరంగా పోతాయి."

"నిజమే సార్. కాని ఆ స్థలంలో నర్సరీ ఉండనివ్వరాదని ఏనుగులు పంతం బట్టాయి సార్."

"నాన్సెన్స్."

"నిజమేసార్."

సిమ్మన్నదొర ఒక క్షణం ఆలోచించాడు.

"పద, ఆ ఏనుగులరాతిని చూద్దాం," అన్నాడు.

* * *

చుట్టూ పెరిగినగుబురుని రెండు చేతుల్తో తప్పించుకుంటూ అడివిలో కాలిబాటమీద మేనేజరూ కండక్టరూ ప్రయాణం సాగించారు. అరమైలు నడిచినతర్వాత పదేళ్ళక్రితం చెట్లుకొట్టి బాగుచేసిన ఒక ఎకరం నేల కనబడింది. ఈ పదేళ్ళలో చిన్న చిన్న మొక్కలూ, గడ్డీ పెరిగి ఆ చదును చేసిన ఆ పాత నర్సరీ స్థలాన్ని కప్పివేశాయి. ఇంకా వెదురు పందిళ్ళ తాలూకు కొన్ని కర్రలూ, తాళ్ళూ చూచాయగా కనిపిస్తున్నాయి. అప్పుడప్పుడు ఏనుగులు తీసుకువచ్చి తిని పారేసిన వెదురు మొక్క ముక్కలూ, ఆకులూ, కందగడ్డలూ చిందరవందరగా చిమ్మిఉన్నాయి. చుట్టుపక్కల ఏనుగులద్దెలు తాటికాయల్లాగా పడిఉన్నాయి.

నర్సరీకి పదిగజాల దూరంలో ఒక పెద్ద రాయి రెండు ముక్కలుగా బద్దలయి విడిపోయి ఉంది.

"అదే సార్ ఏనుగులరాయి," అన్నాడు తంగముత్తు.

దొరకి జరిగిన విషయం సవిస్తరంగా వినాలని కుతూహలంగా ఉంది. కాని పని సమయంలో మూఢనమ్మకాలగురించి కండక్టరుతో చర్చించడం అంత ఆదర్శప్రాయమైన పని కాదేమో ననిపించింది. నిజానికి ఇది ఎస్టేట్ పనికి సంబంధించిందేనని సమాధాన పడుతున్నాడు.

"అసలేం జరిగింది?"

కాల్చేసిన సుసిని బయటికి తీసెయ్యడానికి పైపుని పక్కనున్న చెట్టుమొదలుమీద కొడుతూ దొర అడిగాడు, తంగముత్తు గొంతు సవరించుకున్నాడు.

* * *

కడకరైకీ ఏనుగులకీ అవినాభావసంబంధం. నిజాన్కి కాడాజాతికంతకీ ఏనుగులు చిరపరిచితాలే. లక్షఎకరాల అడివిలో అవిచ్ఛిన్నంగా తిరుగాడే ఏనుగులమందలకీ గవర్నమెంటు అనుమతించిన అయిదువందల ఎకరాల్లో సారవంతమైన ఎకరం రెండెకరాల కోసం వెతుకులాడే కాడాగుంపులకీ ఆయువుపట్టులు అడవిలో పారే సెలయేళ్ళు. ఎక్కడెక్కడ తిరిగివచ్చినా ఏనుగూకూడా సెలయేళ్ళపక్కనే ఉనికి ఏర్పాటుచేసుకోవాలి. ఇద్దరూ రోజుకి ఎన్నోసార్లు తటస్థపడుతూంటారు. ఒకరంటే ఒకరికి భయం, అనుమానం లేవు. కాడాకి ఏనుగు పవిత్రమైంది. ఏనుగుబలం, సాహసం, ఠీవి అందం కాడాలో, ఆశ్చర్యం, సంభ్రమం, నమ్రత, భక్తి కలిగిస్తాయి. అందుకు ప్రతిచిహ్నంగా ఏనుగు కాడాజోలికి పోదు. వందగజాలదూరంలో కాడానడిచిపోతుంటే చూసీచూడనట్టు ఊరుకుంటుంది.

కాడాలందరికీ ఏనుగులు ఆరాధ్యాలయితే కడకరైకి సన్నిహిత స్నేహితురాళ్ళయ్యాయి. ఊహవచ్చినప్పటినుంచి అవి అతన్ని సమ్మోహితుణ్ణి చేశాయి. ఆకులతోనూ గడ్డితోనూ వేసిన గుడిసెల్లో రాత్రిళ్ళు తల్లీ తండ్రీ మధ్యపడుకుని ఏనుగులగురించే ఆలోచించేవాడు. నక్కకూతలమధ్య, అడివిపంది అరుపుల్లో కోతి కిచకిచల్లో ఏనుగు ఘీంకారం వినిపించినప్పుడు అతనికి ప్రాణం లేచివచ్చేది. ఏనుగుల కథలు చెప్పమని తల్లినీ తండ్రినీ వేధించేవాడు. కడకరై తాతముత్తాతలు ధైర్య సాహసాలకి ప్రసిద్ధికెక్కారు. అతని తాత ఎన్నోసార్లు మదపుటేనుగు భయంనుంచి కాడాజాతిని రక్షించాడు. ఒకసారి అడవిలో గడ్డికోసుకునిగున్న కాడాస్త్రీని మదపుటేనుగు తరుముతుంటే అడ్డుపడ్డాడు. ఏనుగుకి కోపం రెచ్చిపోయింది. స్త్రీని వదిలేసి అతనిమీద కసితీర్చుకోడానికి ఉపక్రమించింది. ఎంతోసేపు ఏనుగువెనకాలే దాక్కుని తప్పించుకోడానికి ప్రయత్నించాడతను. ఏనుగు కొంచెం బొద్దుగా పొట్టిగా ఉంటుంది. వెనకనున్న మనిషిని మెడతిప్పిచూడలేదు. కాని మదపుటేనుగు బుద్ధి చాలసూక్ష్మమైంది. ఒకేవైపు గిరగిరా తిరిగి అతన్ని తొండంలో పట్టుకోడానికి ప్రయత్నిస్తున్నదల్లా ఈసారి రెండోవైపుకి తిరిగింది. కడకరై తాతకి ప్రళయం ఎదురైంది. అతనుమాత్రం ఏం తక్కువవాడు కాదు. వెంటనే ఏనుగుకాళ్ళమధ్య దూరిపోయి పట్టుకున్నాడు. ఏనుగు ఎంత ప్రయత్నించినా విదిలించలేక పోయింది. అతనిపట్టు జంతువుకు చక్కలిగింతలు పెట్టింది. ఒకే భయంతో అది అడవిలోకి పరుగుతీసింది. సమయం కనిపెట్టి అతనుపట్టు వదిలేసి, నేలమీద కూలబడ్డాడు. మళ్లీ మదపుటేనుగు ఆ పరిసరప్రాంతాల్లో కనిపించలేదు.

కడకరై తండ్రికి ఏనుగులంటే ఎంతో అభిమానం. అతని పడుచుదనంలో జరిగిన సంగతి. అప్పుడు తన గుడిసెకి నాలుగయిదువందల గజాల దూరంలో చెరువు ఉండేది. అందులో

# ★ ఏనుగుల రాయి ★

స్నానం చెయ్యడానికీ, నీళ్లు తాగడానికీ ఏనుగులు వేసంకాలంలో వస్తూ ఉండేవి. అతను ఎత్తయిన చెట్టుకొమ్మల్లో దాక్కుని చూసి ఆనందించేవాడు. ఏనుగులకి నరవాసన పసిగట్టడం పుట్టుకతో వచ్చిన విద్యేఅయినా, మనిషి కనిపించకుండా దాక్కుని ఉంటే కళ్లతో కనుక్కునేటంత ప్రజ్ఞ లేదు. ఒకనాడు ఆ గుంపులో మగ ఏనుగ కణతలకింద రంధ్రంలోనుంచి చమురు కారడం చూశాడతను. వెంటనే ఏనుగు మదించిందనీ, "మస్త్"లో ఉందనీ గ్రహించాడు. మగ ఏనుగులు అప్పుడప్పుడూ "మస్త్"లో ఉంటాయి. అప్పుడు అవి ఉగ్రరూపం ధరించి కనుచూపు మేరలో సర్వం ధ్వంసం చేస్తాయి. మనిషి కనిపిస్తే రక్తపు ముద్దగా తొక్కి తాండవమాడతాయి. మనుష్యులను చంపిన మదపుటేనుగులని కాల్చి చంపడానికి ప్రభుత్వం ప్రయత్నం జరుపుతుంది. ఈ ఏనుగు మదించి, అడవిలో పుల్లలు కొట్టుకోడానికి వెళ్లిన ఇద్దరు ముగ్గురు మనుషులని చంపిందని వినగానే దానిని చంపినవాళ్ళకి బహుమానం ప్రకటించింది గవర్నమెంటు. ఈవార్త కడకరై తండ్రి నెంతగానో బాధపెట్టింది. "మస్త్" కలకాలం ఉండబోదనీ, అది తగ్గిన తరువాత ఏనుగు ఎప్పటిలాగా సాధువుగా మారిపోతుందనీ అతనికి తెలుసు. కొన్ని రోజులు పరిసరాల్లో జాగ్రత్తగా మసిలితే పోయేదానికి నిండు ప్రాణిని చంపడం అతని మనస్సుని క్షోభ పెట్టింది. అయితే, ప్రభుత్వం శాసిస్తే అడ్డుతగలగలవాళ్ళెవరు? అతని కొక ఉపాయం తట్టింది. మదపుటేనుగు తిరిగే స్థలంలో పెద్ద గొయ్యితీసి, దాని మీద పచ్చని ఆకులూ కొమ్మలూ కప్పి పెట్టాడు. గొయ్యిమీద మనిషి పరుగెత్తడానికి వీలుగా సన్నటి చెక్కవంతెనలాగా వేసి, గొయ్యికి ఇవతలపక్క వందగజాలదూరంలో నుంచుని డప్పులు వాయించాడు. చప్పుడు విని మదపుటేనుగు ఉరకలు వేసుకుంటూ వచ్చింది. అతనిమీద ఉరికి తొండంతో మెలిపెట్టడానికి వెంటాడింది. అతను కర్రవంతెన మీదగా పరిగెత్తి గొయ్యి అవతలపక్క చేరిపోయాడు. తరుముకువస్తున్న ఏనుగు గోతిలో పడిపోయింది. ఏనుగుది అంత స్థూలకాయం అయినా మనిషితో సమానంగా పరిగెత్తగలదు. ఒక్కొక్కప్పుడు ఓడించనూగలదు. అయినా దాని ప్రాణం కాపాడ్డంకోసం ఆమాత్రం సాహసించడం అవసరం అనిపించిందతనికి. తరవాత పదిరోజులూ వలమందుపడేసి, మంచినీళ్ళు పోసి కడకరైతండ్రిదాన్ని "మస్త్"లో నుంచి తొలగించాడు. అంత ఉగ్రస్వరూపం అతిసామ్యంగా మారిపోయింది. అప్పుడు అది బయటకి రావడానికి పట్టుగా పెద్దపెద్ద దుంగలు గోతిలోకి దొర్లించాడు.

ఇటువంటివే ఎన్నో కథలు. వింటుంటే కడకరై ఒళ్ళు గగుర్పొడిచేది. ఏనుగులంటే విపరీతమైన ప్రేమ అతన్ని ఆవరించేది. వాటిని మననంచేసుకుంటూ నిద్రపోయేవాడు.

ఏడాది-చివర తల్లీ తండ్రీ తక్కిన గుంపుతోబాటు చోటు మారవలసివచ్చినప్పుడు కడకరైగుండెలు వేగంగా కొట్టుకునేవి. కొత్తచోట ఏనుగులుంటాయా? వాటి ఘీంకారం వినిపిస్తుందా? కాడాలు నివసించడానికి గవర్నమెంటు ఏనమలై కొండల్లో పదిహేడువందల ఎకరాల అడివి ప్రత్యేకించింది. అందులో కలపకొట్టి అమ్ముడానికీ ఏనుగుల్నీ నల్లకోతుల్నీ పట్టడానికీ వీల్లేదుకాని వంటచెరకు సేకరించుకోవచ్చు; పశువుల మేతకి గడ్డి కోసుకోవచ్చు; పెద్దపులినీ సాంబర్‌నీ వేటాడవచ్చు; అడివిమేకనీ, దుప్పినీ పందినీ పట్టి తినొచ్చు. ఇంతేకాకుండా ఆ పదిహేడువందల ఎకరాల్లో అయిదువందల్ల ఎకరాల్ని ఛేదించి సేద్యం చేసుకోవచ్చు. కాడాగుంపులు ఏడాదికి నాలుగూఅయిదూ ఎకరాలచొప్పున అడవినరికి రాగులూ, జొన్నలూ, కాయగూరలూ పండిస్తారు. ఏడాదిచివర ఆస్థలం వదిలిపెట్టి వాటికి కేటాయింపబడిన ప్రాంతంలో కొత్తస్థలంకోసం వెతుక్కుంటూ పోతారు. సాధారణంగా పాతచోటుకి తిరిగి పదిపదిహేనేళ్ళవరకూ రారు. ఇలా తిరగడంలో ఎప్పుడు ఏనుగులు చేరువలోలేని ప్రదేశానికి చేరవలసివస్తుందోనని కడకరై బాధ.

కడకరై కొంచెం పెద్దవాడయి ఏడెనిమిది సంవత్సరాల వయసు వచ్చేటప్పటికి గుడిసెచుట్టుపక్కల చిట్టడవిలో ఏనుగుల గుంపులకోసం వెతకడం ప్రారంభించాడు. ఏనుగులు అరమైలుదూరంలో ఉండగానే ఘీంకారం వెదురుబొంగులు విరిగిన ఫెళఫెళలూ వినిపించేవి. తనను మాస్తే అవి పారిపోతాయని అతనికి తెలుసు. జాగ్రత్తగా చెట్టుచాటునో రాయిచాటునో నక్కి గంటలతరబడి తనివి తీరా చూసేవాడు. చూసినకొద్దీ వాటి గాంభీర్యం అమాయకత్వం అతణ్ణి పరవశం చేసేవి. దగ్గిరకివెళ్ళి తొండంమీద ఆప్యాయంగా నిమరాలనీ, మంచిపళ్లూ కందమూలాలూ తినిపించాలనీ ఆశగా ఉండేది. అయితే ఆ వయస్సులో అతను సాహసించలేకపోయాడు.

ఈ విషయం గుంపులో పాక్కిపోయింది. తల్లితండ్రుల చెవినకూడా పడింది. కడకరై తండ్రికి ఏనుగులకంటే ఎంతముక్కువైనా అంత చిన్నవయసులో కొడుకు అడవులు గాలిస్తుంటే భయంవేసింది. "మస్త్"లో ఉన్న ఏనుగులు, పెద్దపులులు, ఏదుపందులు, కొండచిలువలు – దేనివాతబడ్డా ఆశవదులుకోవలసిందేకద! అతను కొడుకుమీద ఒకకన్ను వేసి ఉంచాడు. పగలల్లా కడకరై పొలంలో పనిచెయ్యాలి. రాత్రి కొడుక్కి నిద్రపట్టేవరకూ పక్కలో వేసుకుని కథలు చెప్పేవాడు. కునుకుపట్టిన తర్వాత గుడిసె మూలలో ఉన్న వేరే పక్కలో వేస్తాడు. అయితే, తల్లీతండ్రీ కబుర్లు చెప్పుకుంటూ మెల్లిగా నిద్రలో మునిగిపోయేసరికి కడకరై ఒకనిద్రతీసి ఏనుగుల్ని కలుసుకోడానికి సిద్ధంగా ఉండేవాడు.

మొదట్లో ఏనుగులకోసం మైళ్ళుమైళ్ళు తిరగవలసివచ్చింది. ఏనుగుల అలవాట్లు తండ్రిచెప్పిన కథలవల్ల కడకరైకి చూచాయగా తెలుసు. రోజుకి సరిపడే ఆరువందల పౌన్ల ఆకులూ అలములూ సంగ్రహించుకోడానికి ఒక్కొక్క ఏనుగూ కనీసం పది మైళ్ళ అడవయినా గాలించాలి. ఏనుగులతోపాటు పదిమైళ్ళ ప్రయాణానికి సిద్ధపడి వెళ్ళేవాడు కడకరై. దూరంగా ఏనుగుల చప్పుళ్లు వినిపించేవి. ధ్వనిబట్టి దూరాన్ని లెక్కకట్టడం కాడాలకి ఉగ్గుపాలతో నేర్పినవిద్య. కడకరై ఏనుగుల గుంపుల ఉనికి అంచనా వేసేవాడు. ఏనుగులు నడచిన దారి చక్కని రహదారిలాగా ఉంటుంది. అయితే ఆదారి ఎప్పుడు వేసిందీ కనుక్కోడానికి రోడ్డుపక్కని చెట్టుకొమ్మల్ని పరీక్షించేవాడు. అప్పుడే విరిగిన కొమ్మలు

(4.-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

| 24-6-59 మొదలు 30 6 59 వరకు |

## బి. నరసింగరావు

గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| కే | | . | ర బు |
| | తే 24 దీని బుధుడు కర్కాటకములో ప్రవేశించును. తే 30 దీని శుక్రుడు సింహములో ప్రవేశించును. మకర, కుంభ, మీన మేషములలో చంద్రుడు. | | కు శు |
| | | | |
| శ | గు | | రా |

### * అశ్విని [చూ. చే. చో. లా] *

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. వింతమాటలు వినుట పరాక్రమముచే ఘనత, ప్రయాణము, ధనలాభము కలుగుతవి. అనారోగ్య సూచనలు కనపడగానే జాగ్రత్త పడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత విద్యార్థులకు ప్రతికూల ఫలితాలు కలుగును. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత. 26 న పితృవర్గ సహాయము కార్యలాభము. ప్రయాణము. 27 28 అనారోగ్య సూచనలు.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము యత్న కార్యసిద్ధికి ఆలస్యము కలుగుతుంది. వర్తకులకు లాభము తక్కువ. ఆత్మీయుల ఆరోగ్యము చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వతప్రాంతములకు బదిలీ అయే సూచనలున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగించబడుతారు వారమంతా చికాకుగావున్నా వారాంతమందు అజ్ఞాతమిత్రుని సహాయమువల్ల కార్యసిద్ధి కలుగుతుంది.

### * కృత్తిక [అ, ఈ, ఊ, ఏ]

ఈ వారము ధనాభావము ఎక్కువ. ఎవరి సహాయమువల్ల కార్యసాధన చేదామనుకున్నారో, వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయినా దైవబలమువల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి వర్తకులకు నిరాశ. వారమంతా ఆందోళనగా వున్నా సాధుసాంగత్యము, పుణ్యక్షేత్రసంచారము నష్టద్రవ్యలాభము కలుగును.

### *రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము ప్రతికూలత ఎక్కువ. యత్న కార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తాయి. కోర్టుదావాలు అనుకూలిస్తాయి. పరోపకారానికి యత్నపడి సాగక నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యము సరిగా వుండదు. ఇచ్చిపుచ్చుకునేపట్ల వివాదాలు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వారమంతా నిరాశగా వున్నా వారాంతమందు కొంత కార్యసిద్ధి కలుగుతుంది.

### * మృగశిర [వే, వో, కా, కి] *

ఈ వారము ఎన్ని అవాంతరములు వచ్చినా లెక్క చేయక పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు. ఆశించిన డబ్బు సమయానికి అందక అప్పు చేస్తారు. సోదర సహాయము కలుగుతుంది. ఆత్మీయులవల్ల నిందలు పొందుతారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, రంగులు సోపుసామానుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన యోగము. 24 న ప్రమాద సూచన.

### * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

ఈ వారము మీకు యోగప్రదము. బంధువులసహాయముతోనూ, అధికారులసహాయముతోనూ ఆటంకములను గడిచి ఫలం పొందుతారు. ఆదాయము వృద్ధిఅవుతుంది. వైద్యజ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్యదిక్కునుండి కుశలవార్త తెలుస్తుంది. కవులకు, గణితశాస్త్రజ్ఞులకు, శిల్పులకు, నటనటులకు యోగకాలము. 26, 29, 30 తేదీలు ధనలాభము. కార్యసిద్ధి,

### * పునర్వసు [కే, కో, హా, హీ] *

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికివస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో అనుకూలత వుంటుంది. పండిత గోష్ఠి జరిపి నూతనాంశాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగములున్నా కొంత ఆందోళనతో కూడివుంటుంది. 26న ధన లాభము. కార్యసిద్ధి. 27, 28 అధికఖర్చులు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది.

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారము వినోదములలో పాల్గొనుట, దధి, క్షీర, మధురపదార్థయుక్తసుభోజనము రజతపాత్రలలో భుజించుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లని వస్తువులు కొనుట మొదలైన యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థ జన్యముల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది. విద్యార్థులకు మంచికాలము. 27, 28 అధిక ఖర్చులు, ఆందోళన.

### * ఆశ్రేష [డీ, డూ, డే, డో] *

ఈ వారము ధనధాన్యవృద్ధి, కృషిమూలకముగా లాభము, వివాహాది శుభ కార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తులాభము, పరోపకారంవల్ల కీర్తి వంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువు బాగా సాగుతుంది. విలువగల వస్తువుల క్రయవిక్రయాలలో వర్తకులకు రెట్టింపు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు యోగకాలము. ఆప్తులతో విందు, వినోదము.

### * మఖ [మా, మీ, మూ, మే.]

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ, రాబడి తక్కువ. గృహోపకరములు తీరక కలతలు, ఆరోగ్యము సరిగాలేని సూచనలు కనపడగానే ఔషధ చికిత్స పొందడమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతి చేయించుట మేలు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు, వర్తకులకు ఆందోళన. 26 న పితృవర్గ సహాయము, ధనలాభము. ప్రయాణము. 28 న ఆరోగ్యభంగం.

#  నక్షత్రఫలితాలు 

## ఈవారము ధరలు:

నూలు, వస్త్రములు:- తగ్గుదలలో వుండును.
నూనె దినుసులు:- స్వల్పముగా పెరుగును.
ఆహారధాన్యములు:- మార్పు లేదు.
బెల్లము, పంచదార:- చింతపండు:- మార్పు లేదు.
పప్పుదినుసులు:- మందముగా వుండును
వెండి, బంగారము:- నిలకడగా వుండును
సువృష్టిగా వుండును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణ అను పేరునకు మృగశిరానక్షత్రమును, వృష్ణి అను పేరునకు స్వాతియు, శ్రీహరి అను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడు అను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయును చూచుకోనునది.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### [మో, టా, టీ, టూ,]

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట్లో నిరాశగావున్నా మిత్రసహాయము వల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపం వల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకము వల్ల చదువుసాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములున్నా మిత్రసహాయము. కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము. విచిత్రవస్తుసంపాదనవంటి శుభయోగములు కూడా ఉంటవి.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారము మీరు సహాయము పొందదలచుకున్న వ్యక్తిమూలముగా కార్యహాని పొందుతారు. ధనాభావంకూడా ఎక్కువ. ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆధ్యాత్మిక-చింతవల్ల దైవముపై భారము వేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి, వ్యాపారస్తులకు నిరాశ, విద్యార్థులకు మంచికాలము కాదు. పుణ్యక్షేత్ర సంచారము. దేవతాదర్శనము, విచిత్రములను చూచుట జరుగును. వారమంతా అవయోగ శుభయోగ మిశ్రమముగా ఉంటుంది.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈవారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. యత్నకార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టుదావాలు అనుకూలిస్తాయి. ఇతరులకు సహాయము చేయబోయి ఫలించక నిందలు పొందుతారు. యిచ్చిపుచ్చుకోవడములో వివాదములు కలుగుతాయి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణతోటివారి సహకారమువుంటాయి. వర్తకులకు వారమంతా నిరాశ వారాంతమున మేలు. 27,28 భార్య అనారోగ్యముచే ఆందోళన. విద్యార్థులు పరీక్షలలో తప్పుతారు.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించడమువల్ల కార్యసిద్ధి అవుతుంది. ఆశించినసొమ్ము సమయానికి అందక అప్పు చేస్తారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు లోహారంగుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. గనుల యజమానులకు, యంత్రములునడుపు నిపుణులకు ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు మేలుకాలము.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈవారము మీకు రోగకాలము. బంధుసహాయము అధికారుల సహాయము కలుగుటచేత అన్నిచిక్కులు వీడి కార్యసిద్ధి అవుతుంది. ఆదాయము వృద్ధిపొందుతుంది. శాస్త్రప్రసంగాల్లో పాల్గొంటారు. కవులు నూతనరచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషము పొందుతారు. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. గణితశాస్త్రజ్ఞులకు కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము.

### * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈవారము మీకు మంచి భాగ్యయోగము. అనుకున్న డబ్బు చేతికివస్తుంది. ఇబ్బందులు తీరుతవి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తవి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులు పరీక్షలలో నెగ్గుతారు. న్యాయస్థాన ఉద్యోగులకు న్యాయవాదులకు పండితులకు ఉపాధ్యాయులకు మేలుకాలము.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారము మీకుయోగదాయకము. ధనయోగము వుంటుంది. సంగీతసభలు కవితాగోష్ఠివంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్నభోజనము వెండిపాత్రలలో చేస్తారు. శుభకార్యములలో పాల్గొంటారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి, వర్తకులకు లాభము. విద్యార్థులు ఉత్సాహంగా చదువుకుంటారు. కవులు గాయకులకు, కళాకారులకు నటీనటులకు మేలుగావుంటుంది.

### * జ్యేష్ఠ [నో, యా, యీ, యూ,] *

ఈ వారంకూడా మీకు గతవారంవలె నే యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తవి. శుభ, పుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నిస్తారు. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువలాభము. వారమంతా శుభయోగముతో కూడివున్నా వారాంతమున కుటుంబ కలహముచే ఆందోళన కలుగుతుంది. స్త్రీలతోనూ, మిత్రులతోనూ విందు, వినోదము.

### * మూల [యే, యో, బా, బీ] *

ఈవారము రాబడి తక్కువ, ఖర్చులు ఎక్కువ. గృహోపకరణములు తీరక స్పర్థలు వస్తాయి. అనారోగ్యసూచనలు కనపడగానే ఔషధచికిత్స పొందడము, రవికి శాంతి చేయించడము మంచిది. ఉద్యోగస్థులకు కొత్త సమస్యలు వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువుసరిగా జరగదు. వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గసహాయము, కార్యలాభము కలుగుతవి.

### *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢా] *

ఈవారము నిరాశగావున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము అవుతుంది.

ఇంట్లో వున్న వారి అనారోగ్యము వల్ల ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత; వర్తకులకు వారాంతమందు లాభము. వారమంతా ఉద్రేకముగా వుంటుంది. విదేశీయుల పరిచయము. అపురూపవస్తు సంపాదన కలుగుతాయి. 24, 25 అధిక ఖర్చులు మనోవ్యథ. విద్యార్థులు పరీక్షలలో తప్పుతారు.

*** ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ] ***

ఈ వారము మీకు మిశ్రమ యోగము. ఆశించిన సహాయము లభించక, అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. అయినప్పటికీ దైవానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్థులకు అధికారుల అనాదరణ, వర్తకులకు చాంచల్యము. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగావున్నా నష్టద్రవ్యలాభము పొందుతారు. 27, 28 అధిక ఖర్చులు.

*** శ్రవణము [జూ, జే, జో, ఖా] ***

ఈ వారము అనుకూలతకన్నా ప్రతికూలత యెక్కువ. ఇచ్చిపుచ్చుకునే వట్ల వివాదాలు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలించినా అమిత ఖర్చులవల్ల ఆ సంతోషము వుండదు. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. ఇతరజాతులవారివల్ల గౌరవము కలుగుతుంది. 24 25 భార్యకు అనారోగ్యము, బంధువుల రాక, అధిక ఖర్చులు.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్నకార్యములకు ఆటంకములు కలుగుతునే వుంటవి. అయిననూ పట్టుదలతో యత్నించి కార్యలాభము పొందుతారు. సోదరసహాయం వల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహఖనిజ వ్యాపారస్తులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలం. 24 న ప్రమాదసూచన అధిక ఖర్చులు.

*** శతభిషం [గో, సా, సీ, సూ] ***

ఈ వారము మీకు యోగకరము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి ధనలాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కు నుండి క్షేమవార్త తెలుస్తుంది. శుభకార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము కలుగుతుంది. గణిత జ్యోతిషశాస్త్ర చర్చలు జరుపుతారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచు వర్తకులకు లాభదాయకము, కవులకు శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. 26 న కార్యసిద్ధి, 27, 28 అధిక ఖర్చులు.

*** పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] ***

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికి వస్తుంది. ఇంట్లో శుభకార్యాల ప్రయత్నములు చేస్తారు. పుణ్యకార్యాచరణ, ప్రభుత్వ సన్మానము శాస్త్ర చర్చలు జరుగుతవి. విద్యార్థులు క్రొత్త విషయాలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు మేలుగా వుంటుంది. ఇంట్లో వున్నవారి అనారోగ్యము వల్ల కలిగిన ఆందోళన తొలగుతుంది. పిల్లల లాభక్షేమములకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి.

*** ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] ***

ఈ వారము మీరు తలపెట్టిన పనులలో జయము పొందుతారు. నీటిపై ప్రయాణము చేయవలసి వస్తుంది. బంధుమిత్రులతో వినోదములలో పాల్గొని మృష్టాన్న భోజనము చేస్తారు. విద్యార్థులు ఉత్సాహంగా చదువుకుంటారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థ జనిత వస్తువులు క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఈ వారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి కలుగుతుంది. వివాహాది కార్యాలోచనలు ఫలప్రాప్తి పొందుతాయి. ఇష్టవస్తులాభము, పరోపకారమువల్ల కీర్తి కల్గుతవి. విద్యార్థులకు చదువు బాగాసాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము ఎక్కువ. వాహనయోగము కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. 27, 28 కుటుంబ కలహము. ★



# వనితా లోకం





## అందాల బాటలో

తోలి మలంప

'అందమైనవస్తువు ఆనందానికి హేతువు' అన్నాడు ఒక మహాకవి. అందం ఆడవాళ్ళ సొత్తు; దాన్ని కాపాడుకోవడం స్త్రీల విధి.

చాలమంది అందంగా కనిపించాలని మొహంనిండా స్నో, పౌడరూ అర అంగుళం మేరకు అద్దుతారు. కాని అందాన్నిచ్చేది మొహం మాత్రమే కాదని గుర్తించాలి. శారీరకంగా ఆరోగ్యంగా వుండటం స్త్రీకి అందమిస్తుంది. లేని అందాన్ని తెచ్చి పెట్టుకోటం కంటే ఉన్న అందాన్ని కాపాడుకోటం మంచిది. సౌందర్యపోషణకు ఉపయుక్తమయే పరికరాలను, తీసుకోవలసిన జాగ్రత్తను చర్చించుదాం.

'సౌందర్య పోషణకి' ఆరోగ్యం ముఖ్యమైనదని ముందే చెప్పాను. నివసించే ఇళ్ళు, పుచ్చుకునే ఆహారం, ధరించే బట్టలు వీటన్నిటిలోనూ తగినంత శ్రద్ధ చూపెడుతుండాలి.

అందాన్ని పెంపొందించుకోటంలో సూర్య రశ్మి, మంచిగాలి సహకరిస్తాయి. చీకటిగదుల్లో నివసించటం, గదుల్లో తలుపులు బిగించుకుని పడుకోటం ఆరోగ్యకరం కాదు.

ఆహారం పుచ్చుకోటంలో కూడ తగుశ్రద్ధ చూపాలి అతిగా తినటంవల్ల గాని, తక్కువ తినటం వల్ల గాని వేళ తప్పి తినడంవల్ల కాని ఆరోగ్యం దెబ్బతింటుంది. మొహంలో కళ, కళ్ళలోని కాంతి క్షీణిస్తవి. అజీర్తి మొదలైన వ్యాధులు వస్తాయి.

బేలన్స్‌డ్ డయెట్ (శరీరానికి కావలసిన అన్ని పదార్థాలు తగు పాళ్ళలో ఉన్న ఆహారం) పుచ్చుకోవాలి సమీక్ష్యతాహారం పుచ్చుకోనటమంటే ఏదో పెద్ద ఖర్చుతో కూడిన పని అని భయపడనక్కర్లేదు. మాంసకృత్తులు, కార్బొహైడ్రేటులు లవణాలు, విటమిన్లుగల పదార్థాలు పుచ్చుకోవటమే!

ఈ విషయం చిన్నప్పుడు సైన్సు పాఠాల్లో అందరూ నేర్చుకొన్నదే, అయినా వాటిని పరీక్షలకోసం కంఠతా పట్టినవారేగాని, నిత్యజీవితంలో ఆచరించిన వారు అరుదు. మళ్ళీ ఓసారిజ్ఞాపకం చేసుకుంటారని ఇక్కడ ఆ వివరాలు రాస్తున్నాను.

### సంవరి

మాంసకృత్తులున్న పదార్థలు:—పాలు, కోడిగ్రుడ్లు, జున్ను, మాంసం, చేపలు, వెన్న, బఠాణీలు, చిక్కుడు, పప్పుదినుసులు మొదలైనవి.

పిండిపదార్థాలు (కార్బొహైడ్రేటులు) గల పదార్థలు:— బంగాళాగుంపలు, చిలగడగుంపలు, బియ్యం, గోధుమలు, జొన్నలు మొదలైనవి.

లవణాలుగల పదార్థాలు:— పాలు, మజ్జిగ, మునగకూర, తోటకూర మొదలైనవి.

విటమిన్లు నాలుగు ముఖ్యమైనభాగాలుగా విభజించబడ్డాయి.

ఎ. విటమిన్. నెయ్యి, పాలు, గుడ్లు, తోటకూర, కాబేజి, నారింజ, టొమాటోలు మొదలగు వాటిలో ఉంటుంది.

బి. విటమిన్: మజ్జిగ, గోధుమలు, గ్రుడ్లు,

సి. విటమిన్: నారింజ, నిమ్మ, టొమాటో, పండ్లరసాలు.

డి. విటమిన్: వెన్న, నెయ్యి, కాడ్ లివర్ ఆయిల్ (చేప నూనె), వేడిమిని కలిగించే క్రొవ్వుపదార్థాలు, వృక్ష సంబంధమైన నూనెలు, పాలు' వెన్న, మీగడ మొదలైనవాటిలో వుంటాయి.

మాంసకృత్తులు శరీరం పెంగటానికి ఉపకరిస్తాయి. పిండిపదార్థాలు చురుకుదనాన్ని కలిగించి, శక్తినిస్తాయి. లవణాలు రక్తశుద్ధికి పుష్టికి ఉపయోగపడుతవి. విటమిన్లు దేహపోషణ క్రమంగా జరగటానికి సహకరిస్తాయి. క్రొవ్వులు అవసరమైనప్పుడు శరీరములో వేడిమిని కల్గించటానికి తోడ్పడతాయి.

మనం పుచ్చుకునే ఆహారంలో ప్రతి రోజూ దినుసుకు ఒక్కటైనా కనీసం పుచ్చుకుంటుండాలి. బంగాళా గుంపలలాంటి 'పిండిపదార్థాలు' శరీర పరిమాణాన్ని బట్టి రోజూ చేసే శ్రమనుబట్టి వాడాలి.

పంచదార కూడ సౌందర్య పోషణకి ఉపకారే, కాని కొన్ని రకాల జబ్బులున్న వాళ్ళు మాత్రం దీన్ని వాడకూడదు. రెండు చెమ్చాల పంచదార గ్లాసుడు నీళ్ళలో కలుపుకొని తాగితేచాలు. ఇది అతిచౌకైనట్టి సౌందర్య సాధనం. చలవ చేస్తున్నా న్నాళ్ళు తాగినా, జలుబు చేస్తే మానెయ్యండి.

సూర్యరశ్మివల్ల కూడ విటమిన్లు శరీరానికి చేరుతాయి. సూర్యరశ్మి లోపించటంవల్ల గుండెజబ్బులు రావటానికి అవకాశంవుంది. చలి కాలంలో పశువుల పాలలో 'విటమిన్ ఎ' తక్కువగా వుంటుంది. కాబట్టి ఆరోజుల్లో 'ఎ' విటమిన్‌గల ఇతరపదార్థాలు పుచ్చుకోడానికి ప్రయత్నించాలి.

'ఎ విటమిను' ఎక్కువగావుండేది 'కాడ్ లివర్ ఆయిల్' చేపనూనెలో. ఈనూనె పుచ్చుకునేవారు ఐదారు వారాలకు వరసగా

పుచ్చుకుని, తర్వాత ఒక పదిహేను రోజుల పాటు పుచ్చుకోటం ఆపాలి.

ముఖాన్ని అందంగావుంచే ఆహారపదార్థాలు: ఉల్లిపాయలు, కారట్ (ఇంగ్లీషు కాయగూర) నారింజ, ఆపిల్ పళ్ళు, ఇంకా 'విటమిన్ బి' పదార్థాలు.

## సన్నబడటం

కొంతమంది ముఖ్యంగా కాలేజీలో చదివే అమ్మాయిలు—సన్నగా అవాలని ఉపోషాలుంటారు. అందువల్ల సన్నమయే మాట అటుంచి తీవ్రమైనజ్వరానికి లోనవుతారు.

లావు తగ్గించటానికి పోషక పదార్థాలు తక్కువ తినాలి. బంగాళాదుంపలు, పచ్చళ్లు తినటం తగ్గించాలి. ఇలా చేయటంవల్ల లావు తగ్గటానికి అవకాశముంది. అయితే ప్రయత్నంవల్ల కూడ ప్రయోజనం కనిపించకపోతే, డాక్టర్ సలహా తీసుకోవడం మంచిది. మలబద్ధకం ఏర్పడినప్పుడు ఇష్టం వచ్చినట్లు మందులు వాడేయకూడదు. క్రమంగా తేలికైన ఆహారాన్ని పుచ్చుకుంటూ, తగ్గించటానికి ప్రయత్నించాలి.

అందమైన చర్మం ఏర్పడటానికి మరొక సులువైన మార్గంవుంది. ఈ ప్రయత్నం ప్రతి ఒక్కరిలోనూ నూటికి తొంభైతొమ్మిది పాళ్ళు ఫలితాన్ని చూపిస్తుంది. అయినా నూటికి 99.9 మంది ఇలాటి చిన్న చిన్న వాటినే అనుసరించడానికి బద్ధకిస్తారు.

ప్రతిదినమూ ఆహారంతోపాటు ఏడు మొదలు, పదిగ్లాసుల వరకూ మంచినీళ్ళు పుచ్చుకోండి. మంచినీళ్ళంత మంచి వస్తువు మరోటి లేదన్నాగా. పొద్దుట మంచినీళ్లతో ఆరంభించి రాత్రి పడుకోబోయేటప్పుడు పాలు, నారింజ, నిమ్మరసం, లేక బార్లీ నీరు పుచ్చుకోవాలి.

లావుగావుండేవాళ్ళు చాలమంది నీరు ఎక్కువ తాగటంవల్లనే 'లావు' అయ్యామని దురభిప్రాయ పడతారు. కాని గృహిణి అయిన స్త్రీకి ఇంటిపనులు వ్యాయామం లాంటివి. కాని లావైన వాళ్ళు ఎక్కువగా కష్టపడటం పనికిరాదు.

పైన వ్రాసినవన్నీ ఎంతో తేలిగ్గా, సరదాగా ఆచరణలో పెట్టవచ్చు. అవి కఠోర నియమాలేం కావు. ఎప్పుడూ ఆనందంగా, చిరునవ్వునవ్వుతూ ఉండటానికి ప్రయత్నించండి. భయాన్నీ, కష్టాన్నీ దాచిపెట్టుకుని పైకి నవ్వుతున్నట్టు నటించటం కష్టమే. అయినా అంతకంటె పెద్ద కష్టాలను అనుభవిస్తున్నవాళ్ళూ ఉన్నారని గ్రహించగలిగితే, కనీసం మరొక్కనాటైనా జీవించగలం.

మన మనోభావాలను ప్రతిఫలింపజేసేవి అలంకరణలు, ఆభరణాలు. అందువల్ల వస్త్రధారణలో గాని, ఆభరణాల అలంకరణలో గాని తగినంత శ్రద్ధ చూపినట్లయితే, 'అందాలబాట' లో తొలిమలుపు తిరిగారన్న మాట!



# నెమలిని పెంచు విధానము

కుమారి సంగీత గారు నెమలిని పెంచు విధానము గూర్చి వనితాలోకం ద్వారా తెలుపమని కోరిరి. అది చూచుటతోటనే నాకు వ్రాయాలను సంకల్పం కలిగినది. ఎందుచేతనగా మాయింట్లో మేము రెండు నెమళ్ళను (సుమారు ఒక సంవత్సరంనుంచి ఒక మగనెమలిని, 8 నెలలనుంచి ఆడనెమలిని) పెంచుతున్నాము.

మగనెమలి సాధారణముగా ఎత్తున నివసించాలని తలుస్తుంది. దానిని ఒక ఎత్తుగల ప్రదేశంలో అనగా ఏదైన అడ్డుగా కట్టిగాని, ఒక స్టాండువంటిదిగాని వేసి ఒక వరండాలో ఉంచాలి. మేము ఒక కుర్చీ ఏర్పాటుచేసితిమి. అది ఎప్పుడు పైననే ఎక్కి నిల్చుంటుంది. అలాగా నిద్రపోతుంది కూడా. క్రిందకు దిగదు. ఆడనెమలిని క్రిందనే దేనికి కట్టినా వుంటుంది. మగనెమలికి గోడలు, చెట్లు ఎక్కి వుండాలని సరదా. అలా అయితే అది సంతోషంగా ఉంటుంది. చిన్న చిన్న తోటలలాంటి ప్రదేశమైతే వాటికి మరీ హాయిగా ఉంటుంది. ఒకసారి వదిలితే పై గోడలు, చెట్లు పైకి ఎగిరిపోతుంది. అసలు వాటికి ఎంత స్వేచ్ఛ ఇస్తే అంత ఆనందంగా ఉంటాయి. ఇంట్లో వుండేవారు వాటికి బాగా గుర్తే ఎవరైనా క్రొత్త వ్యక్తులు వస్తే ఒక వింతమైన అరుపుతో ఆ సంగతి తెలియజేస్తాయి. వారు కనక దగ్గరగా వస్తే, ముక్కుతో పొడుస్తాయి కూడా! వీటిని మనుష్యులకు అలవాటుగునట్లు మన పరిసరములలోనే కట్టవలెను. అలావుంచిన వాటికి మనుష్యుల భయముండదు. లేకున్న మనుష్యులను చూచి భయపడి పోవటమో పారిపోవుటయో చేస్తాయి.

పాణ్యం పల్లి సూర్యకుమారి

మా పొరుగువారు మా నెమళ్ళను చూచి 8 నెలల వయస్సుగల 2 చిన్న నెమళ్ళను తెచ్చి, మేడపైగల వరండాలో ఒక బోను వలె తయారుచేసి అందులో భద్రముగా వుంచారు. వాటికి మనుష్యుల చూపులేదు. యజమానులు ఇద్దరు తప్ప ఇంకేమీ తెలియదు. వాటిని అలా జైలులో బంధించారు. అవి ఎవరైనా వెళ్ళితే కంగారు పడి చాల బాధపడి ఎగిరిపోవాలని ప్రయత్నించేవి. ఆహారము తీసికొనుటకు కూడ చాల భయపడి ఎగిరిపోవుటకు ప్రయత్నించేవి. దగ్గరలో ఎవరైనా నిలబడితే పొడిచేవి. అందు వాటిని బంధింపకుండ ఫ్రీగా నలుగురిలో తిరుగునట్లు కట్టిన వాటికి మనుష్యుల వల్ల భయము ఏమియు వుండదు. వాటి కాలికి పొడుగైన త్రాడు మృదువుగా కట్టి ఫ్రీగా వదలాలి. ఈ విధంగా లేకపోతే నెమలి బెంగపెట్టుకుని చనిపోతుంది.

ఉల్లాసముగా వున్నప్పుడు, మబ్బువేసి, ఆకాశం నీలంగా యున్నప్పుడు చల్లని గాలివేసినపుడు నెమళ్ళు పురివిప్పి, నాట్యం చేస్తాయి. ఆ సమయములో చూచుటకు అవి చాల ఆనందకరముగ వుండును. రేడియో పెడితే ఆ గానము విని ఆ పాట వినిపించు మార్గమువైపు చూస్తూ చాల ఆనందించుచూ పురివిప్పి నాట్యం చేస్తాయి.

ఆహారవిషయములో తగు జాగ్రత్త కలిగి యుండవలెను. వాటికి ఎప్పుడూ అన్నము పెట్టకూడదు. అది వాటికి జీర్ణముకాదు. ఎందుచేతనన దాని ముక్కుతో కొట్టి ఆహారమును తీసుకొనిన బాగుగా జీర్ణము అవుతుంది

వాటికి మేము ప్రతిరోజు ఇచ్చు ఆహారము, గంట్లు, బియ్యం, మరమరాలు, చోళ్ళు. జొన్నలు, రాగులు, లేత చిగుళ్ళు. కాబేజీ, పెసరపప్పు, పచ్చిమిర్చి, పకోడీలు, కారప్పూస, బూంది, వుల్లిపాయ, కాయకూరలు (ముక్కలుచేసి) మొదలగునవి. ఇవి అన్ని అన్ని వేళల మార్పుతో పెట్టుదుము. వీటన్నిటిని అవి ముక్కుతో కొట్టి తీసుకొంటాయి. తరవాత ఒక గ్లాసులో నీళ్ళుపోసి దగ్గర వుంచితే త్రాగుతాయి. రోజుకు అధమము నాలుగైదుసార్లైన ఆహారము ఇవ్వాలి ఉదయం 6 గంటలకు, 10 గంటలకు, మధ్యాహ్నం 1 గంటకు, 4 గంటలకు రాత్రి 7 గంటలకు పైవాటిలోనివే మార్చి పెట్టాలి. ఈ విధముగాఆహారముమార్చి పెట్టినచో, అవి సక్రమముగ ఇష్టముతో తినును. వాటికి అప్పుడప్పుడు బెల్లమునీరు పోసినచో అవి బైటకి పారిపోక మచ్చికఅవుతాయి. వారమునకొకసారి కొద్దిగా నల్లమందు వేస్తే కూడా ఎక్కడికి పారిపోదు. ఒకవేళ వెళ్ళినా తిరిగి తిరిగి ఇల్లు చేరుతాయని కొందరు చెప్పారు.

ఇక వాటి ఆరోగ్యవిషయములో తగు జాగ్రత్త చాల అవసరము. ప్రతి నెమలికి సంవత్సరమునకొకసారి అనగా తెలుగు సంవత్సరాదికి ముందుగా, కాళ్ళకు జీడి పెట్టాలి. అలా పెట్టితే దానికి ఏవిధమైన జబ్బు చేయక ఎల్లప్పుడూ ఆరోగ్యంగా ఉంటుంది. 


ఒక క్రొత్త రేడియో...

# వనితా వాణి



బి. వి. కామేశ్వరిగారు "తివిరి ఇసుమున" అను వ్యాసం రాశారు. అందులో ఆవిడ ముఖ్య ఉద్దేశ్యము మూర్ఖుల గురించి రాయడం కానీ ఆవిడ అనవసరంగా కొన్ని విషయాలు రాసేరు. అవి మూర్ఖులకి ఏ మాత్రము సంబంధించినవి కావని నా ఉద్దేశ్యము.

కామేశ్వరిగారి పొరుగింటావిడ 7 గజాల చీర కట్టుకొనేవారనియూ ఈవిడ ఆరుగజాలు చీర కట్టుకొంటే హేళనచేసి మరికొన్నాళ్ళకు ఆవిడే ఆరు గజాలు కట్టుకొన్నారని రాసేరు. మనస్సు చంచలమైనది. అందుచే వాళ్ళ ప్రక్క ఇంటావిడ కొన్నాళ్ళు హేళన చేసినను ఈ కాలంవాళ్ళు ఏడు గజాలు చీర కట్టుట అరుదుగా ఆవిడకి కనిపించవచ్చు. అందుచే ఆవిడకూడా 6 గజాలు కట్టవచ్చు. అంతేగానీ ఆవిడకి ఈ విషయంలో మూర్ఖత్వము లేదు.

కె. శాంతకుమారి, (భిలాయ్.)

* * *

సన్నబడటానికి మార్గము గురించి వ్రాసిన కె. లీలగారికి వనితాలోకం ద్వారా ధన్యవాదాలు తెలుపుచున్నాను.

బి. వెంకటశేషమ్మ: (మచిలీపట్నం.)

* * *

వకుళ మాలగారు వ్రాసిన "ఆర్చేవారూ ఓదార్చేవారు" అనే వ్యాసం పాఠకులకు ఎందుకు పనికి వస్తుందో అర్థం కావటం లేదు. వనితాలోకం శీర్షికద్వారా ఏదైనా ఒక సాంఘిక వ్యవస్థను చర్చించదల్చుకుంటే అదొక అందముచందము. అంతేకాని అర్థంలేని భావాలతో వింతపోకడలుపోయి, అడుగడుక్కీ ఇంగ్లీషుముక్కలు వాడటం పెద్ద ఘనకార్యం కాదు.

వనితాలోకానికి వ్యాసం వ్రాసేటప్పుడు వాడుకభాషను అదైనా సామాన్యశైలిలోనూ వెర్చుకోవాలి. పెద్దపెద్ద సమాసాలు, అలంకారాలు వాడినంతమాత్రాన అది పెద్ద వ్యాసం అనిపించుకోదు. ఇకపోతే అసలు రచయిత్రి ఈవ్యాసం ద్వారా ఏమిచెప్పదల్చుకున్నారో, సరిగా అర్థంకావటం లేదు. చెప్పదల్చుకున్న విషయాన్ని సూటిగా ఇతరులకు వెంటనే అర్థం అయ్యేట్టుగా చెప్పగలగటం వ్యాసం రాయటంలోని ఒక ప్రత్యేకత. డొంకతిరుగుడుగా, "నీముక్కెక్కడంటే,చుట్టూతిప్పి చూపించినట్టు" ఇటువంటి వ్యాసాలు పాఠకులు అభిమానాన్ని సంపాదించలేవు.

రమ, (బందరు.)

* * *

వకుళ మాలగారు వ్రాసిన "ఆర్చే" వారు ఓదార్చేవారూ అన్న వ్యాసము చాల బాగున్నది.

ఎన్. ధనలక్ష్మి, (తుని.)

* * *

'ఆర్చేవారూ ఓదార్చేవారు' చాలా చక్కగా వుంది. సందర్భానుసారంగా 'వుచితం' వుపయోగించడం, నిత్యజీవితంలో 'ఫ్రీ'లు సగుచుకుంటూ వాళ్ళో నేను నవ్వుకున్నాను. వ్యాస రచయిత్రికి నా ధన్యవాదాలు వనితావాణిద్వారా తెలుపవలసింది.

సన్నబడడానికి సీతామదణగారి సమాధానం బాగావుంది. అది నాకూ వుపయోగం అనడంలోని అంతరార్థం మీరు ఊహించక పోరనుకుంటా.

మేకా. శశికృష్ణ (సికింద్రాబాద్.)

* * *

వకుళమాలగారు 'ఆర్చేవారూ ఓదార్చేవారూ' అన్న వ్యాసము ఎందుకు వ్రాశారో? ఏ నిమిత్తము వ్రాశారో అనూహ్యము. ఈ వ్యాసము వ్రాసినవారు సోదరి కాదని సోదరుడే అయ్యుంటాడని నా అనుమానము. ఒకవేళ నా అనుమానమే నిజమైతే ఇకముందెప్పుడూ పురుషులు స్త్రీల పేరుమీద ఇటువంటి వ్యాసాలు వ్రాయకూడదని మా ప్రార్థన. ఎవరైనా ఏదైనా వ్యాసము వ్రాశారంటే దానివలన కొంత కాకపోతే కొంతయినా ఉపయోగము వుంటేనే దాని అందము వ్రాసినవారి ఆశయము ఫలిస్తుంది.

భానుమతి రామకృష్ణగారు వ్రాసిన అత్తగారూ జపాను యాత్ర చాల సరదాగ వున్నది. ఇదిగాక ఇంకా సి. రాధగారు వ్రాసిన బట్టలు ఎలా వుతకాలి అన్న వ్యాసము చాల బాగున్నది. పైగా నలుగురకూ ఉపయోగించేలాగున వ్రాశారు.

మిసెస్. మూర్తి. (బందరు.)

* * *

శ్రీ వకుళమాలగారి "ఆర్చేవారు ఓదార్చేవారు" అన్న వ్యాసం చదవడానికి, చాల బావుంది. వారికి నా అభినందనాలు.

వనితాలోకం రచయిత్రులకు నాదొక చిన్నమనవి. ఈమధ్య "వనితాలోకం"లో ప్రచురింపబడే వ్యాసాల్లో ఒక చిన్న విశేషం (మంచిదికాదని నా అభిప్రాయం) కనబడుతోంది. వ్యాసాల్లో అక్కడక్కడ ఆంగ్ల పదాలు వాడడం ఎందుకంట? చక్కని, యింపైన, తేట తెలుగుతో హాయిగసాగే వ్యాసానికి, యీ ఆంగ్ల పదాలు, నదికి ఆనకట్టల్లాగ అడ్డం తగల్తూ కొంతుంటూ,వ్యాసాన్ని పాడుచేస్తాయి. అందువల్ల వ్యాసం, గణించక, రచయిత్రి పూర్ణాభిప్రాయాల్ని పాఠకులకందజేయడానికి వెనుదీస్తుంది. ఈ విషయం ఎందుకు చెబుతున్నానంటే, వనితాలోకం పాఠకులందరూ ఆంగ్లపరిజ్ఞానం కలవారని మనం ఎలానమ్ముతాం? అయిదో తరగతితో చదువాపేసిన స్త్రీలు ఎందరో వున్నారు (వారిలో నేనొకరని). వారికి ఆంగ్ల పదాలెలా అర్థమవుతాయో చెప్పండి? కాబట్టి సాధ్యమైనంతవరకు వ్యాసాలు "అర్థ" మయ్యే రీతి నుండాలని నావాంఛ. ఈ నా అభిప్రాయాన్ని వనితాలోకం రచయితలు, పాఠకులు కూడా ఆమోదిస్తారని భావిస్తాను.

సజ్జా పుణ్యవతి, (మద్రాసు.)

* * *

ఆంధ్రపత్రికలో ప్రచురించిన "అత్తగారూ జపానుయాత్రా" అనే వ్యాసం చదివాను. భానుమతీ రామకృష్ణగారికి ఈ అత్తగారి-దండయాత్రలుతప్ప వేరేకథలు పాఠకుల కందజేయు సంకల్పములేదా?

కె. లక్ష్మీరాణి, (బెంగుళూరు)

★

# ★ ఏనుగుల రాయి ★

( 3 వ పేజీ తరువాయి)

ఏనుగులగుంపు ఆదారిన వెళ్ళినదానికి గుర్తు. దారిలో పెదపెద్దగడ్డలుగా పడిఉన్న ఏనుగు లద్దెల్ని కాలితో తన్నేవాడు. అవి విడిపోయి పొగలుగక్కుతూ కాలికి వేడిగా తగిలే అప్పుడే వేసినట్టుగుర్తు. ఈ ఆధారాలతో కడకరై ఏనుగులున్నచోటుకి చేరుకునే వాడు.

ఎంతో కాలం ఇలా కష్టపడవలసిన అవసరం లేకపోయింది కడకరైకి. అర్ధరాత్రి వరకూ అడవిలో తిరిగి కొన్ని గంటలు విశ్రమించడానికి ఏనుగులరాయి దగ్గరికి చేరుకొనేవి ఏనుగులగుంపులు. ఏనుగులరాయి గురించి చాలా విన్నాడు కడకరై. పెద్ద రాయి మూడువైపులా నేలలోకి పాతుకుని పోయి ఒకవైపు మనిషి పాకివెళ్ళగలిగినంత ఎత్తులో, పదిఅడుగుల వెడల్పున ఖాళీఉంది. రెండుమూడడుగులు పాకి లోపలికి వెళితే ఇద్దరుముగ్గురు మనుష్యులు కూర్చోగలిగినంత స్థలం రాయినొలిచి ఏర్పాటుచేసినట్టుంది. ఈరాయి ఎన్నో కాడా జీవితాలు రక్షించిందని ప్రతీతి. కాడాలు దగ్గర్లోఉన్న పల్లెకో పట్టణానికో కిరసనాయిలు, నూనె, పంచదార కొనుక్కోడానికి వెళ్ళితిరిగి వస్తుంటే ఎప్పుడైనా చీకటి పడిపోతుంది. వెన్నెల రాత్రుళ్ళయితే పరవాలేదు. చీకటి రాత్రుళ్ళల్లో నల్లని ఏనుగు చర్మం గుర్తుపట్టడం కష్టం. ఎప్పుడు "మస్తు"లో ఉన్న ఏనుగు తటస్థపడుతుందో చెప్పలేం. అటువంటి సమయంలో కాడాలు రాతికింద దూరి దాక్కుంటారు. ఏనుగులు పసికట్టి దగ్గరకి వచ్చినా లోపల మనిషికి భయం లేదు. కొండగుహాలోలాగా నిశ్చింతగా కూర్చోవచ్చు. అయితే, కొండగుహకి ఏనుగు ప్రవేశించగలిగినంత ద్వారం ఉండవచ్చు. ఈ రాతిలో ప్రవేశించడానికి రెండడుగుల ఖాళీకంటే ఎక్కువ లేదు. బైట జంతు భయంవల్ల ఎక్కువసేపు లోపలే ఉండిపోవలసిన పరిస్థితి ఏర్పడితే వంటచేసుకోడానికీ, చలిమంట వేసుకోడానికీ మూడు రాళ్ళూ, కొన్ని ఎండుపుల్లలూ రాతిలోపల ఎప్పుడూ భద్రపరిచిఉంచుతారు కాడాలు.

మొదట ఏనుగులరాయిని చూసినప్పుడు గుర్తుపట్టలేదు కడకరై. ఆడివంతా తిప్పి చివరకి ప్రతిరాత్రీ తనని ఏనుగులు అక్కడికి తీసుకువెళ్ళేసరికి అనుమానం కలిగింది. ఎన్నోరోజులు రాయివెనకాలే నక్కి చూశాడు. రాతిచుట్టూ ప్రదేశాన్ని చక్కగా బాగుచేసుకున్నాయి ఏనుగులు. అక్కడ పడుకుని కూడా తెచ్చుకున్న కొద్ది ఆకుల్నీ కొమ్మల్నీ సావకాశంగా తొండంతో మెలిపెట్టి నోట్లో తోసుకునేవి. ఆడ ఏనుగులు చిన్నపిల్లలకి పాలుకుడిపేవి. పిల్లలు తొండం నోటికి అడ్డంరాకుండా పైకి ఎత్తిపెట్టి నోటితో పొదుగుని కరచిపెట్టుకుని తాగేవి. తిండి అయినతర్వాత ఏనుగులు ఆడుకునేవి. ఒక్కొక్కప్పుడు పోట్లాడుకునేవి. కొన్ని ప్రేమకలాపం సాగించేవి. ఎక్కువ అలిసిపోయినప్పుడు రాతికి ఆనుకుని శరీరాన్ని తోముకునేవి. చూసిన కొద్దీ కడకరై ముగ్ధుడై పోయేవాడు.

రోజులు గడిచినకొద్దీ కడకరై దూరం నుంచి చూసి ఆనందించడంతో తృప్తిపొందలేకపోయాడు. అతనికి ఏనుగుల మీద అభిమానం నమ్మకం ఎక్కువయ్యాయి. ఒకరోజున ఏనుగులు రాకముందే రాతిలో దూరి పడుకున్నాడు. మనిషిలోపల ఉన్నట్టువాసనవల్ల గ్రహించి తొండంలోపల చొప్పించడానికి ప్రయత్నించాయి ఏనుగులు. కాని తొండం ఎంతో లోపలికి పోలేదు. రాతిలో కడకరైకి ఒక పక్క భయం, ఒకపక్క ఆవేశం. ఏనుగులు! చేతికందేటంత దూరంలో ఏనుగులు! తనేంచేస్తున్నదీ తనకే తెలియలేదు. రాత్రి తినడానికి తెచ్చుకున్న చెరుకుముక్కలూ, అరటిపళ్ళూ లోపలికి చాచిన తొండాలకి అందిచ్చాడు. వాటిని ఏనుగులు నోట్లో పెట్టుకుంటుంటే కడకరై ఒళ్ళు మరిచిపోయాడు. అప్పట్నించీ రోజూ ఏదో ఒకటి ఏనుగులు తినడానికి తీసుకువెళ్ళేవాడు. ఏనుగులకీ అతనికీ మధ్య ఇలా ప్రారంభమైన మైత్రి కొంతకాలానికి ఎడతెగని స్నేహంగా పరిణమించింది. గుంపులో ప్రతి ఏనుగునీ కడకరై గుర్తుపట్టగలడు. ప్రతిదానినీ పేరుపెట్టి పిలిచేవాడు—పొమ్మన్నస్, మెలన్, కులకడా, కింబన్, ఆనకట్టయ్, కరుప్పాయి, లచ్మి, ఇంకా ఎన్నో పేర్లు. ఇప్పుడు తను రాతికింద దాక్కోవలసిన అవసరం లేదు. రాతిమీద కెక్కి ఒక్కొక్క ఏనుగుని పేరుపెట్టి పిలిచి కొబ్బరి ఆకులూ, వెదురు ఆకులూ, అరటి పళ్ళూ, రాగులూ, చోళ్ళూ, ఏవి దొరికితే అవి పెట్టేవాడు. ఏనుగులు ఆప్యాయంగా అందుకుని తినేవి.

కడకరైకి పన్నెండో యేడు వచ్చేవరకూ తల్లీ తండ్రీతోనే గుడిసెలోనే పడుకునేవాడు. పెద్దవాళ్ళు నిద్ర పోయిన తర్వాత గుడిసె విడిచిపెట్టి ఏనుగులరాయిదగ్గిరకి పోయి తిరిగితెల్లవారకముందే వచ్చిపక్కలో పడుకునేవాడు. పన్నెండో ఏడు రావడంతో అతను మొగవాళ్ళ సత్రవకి వెళ్ళవసి వచ్చింది. కాడాల్లో పన్నెండేళ్ళకి మించిన పిల్లలు తల్లీతండ్రీతో గుడిసెలో పడుకోడానికి వీల్లేదు. ఆ వయసువాళ్లు రాత్రిళ్లు పడుకోడానికి గుంపుకి రెండు సత్రవలుంటాయి. ఒకటి మొగవాళ్ళకి, రెండవది ఆడపిల్లలకి. పెళ్ళి అయేవరకూ వాళ్ళు అక్కడే పడుకోవాలి. సత్రవ నడపడానికీ, పిల్లల యోగక్షేమాలు చూడడానికీ, హద్దులో ఉంచడానికీ ముసలిపెద్దలు—ఆడవారి సత్రానికి అవ్వా, మొగవారిసత్రానికి తాతా—సత్రంలోనే పడుకుంటారు. పిల్లలు రాత్రిళ్లు సత్రం విడిచిపోకూడదనే ఆంక్ష కఠినంగా పాటిస్తారు కాడాలు. అయినప్పటికీ అప్పుడప్పుడూ మగపిల్లలు తాతకళ్ళుకప్పి ఆడపిల్లల సత్రంలో ప్రియురాలిని కలుసుకోడానికి వెళ్ళడంలాంటివి జరుగుతూనే ఉంటాయి. కడకరైకి వర్షాకాలం అంతా సత్రంజీవితం బాధ అనిపించలేదు. వర్షాకాలంలో ఏనుగులు కొండలకింద ఉన్న కాన్ పొన్నాచికి వెళ్ళిపోతాయి. వేసంకాలం సమీపిస్తుందనగా ఎండవేడి భరించలేక నాలుగైదువేల అడుగుల ఎత్తు కొండల్లో ఉన్న ఏనుగులరాయి ప్రాంతాలకి చేరుకుంటాయి. ఈ ఆరునెలల్లో కడకరై ఒక్కరాత్రి కూడా ఏనుగుల్ని చూడకుండా గడపలేదు. జనవరినెల ప్రారంభంలో ఏనుగుల ఘీంకారం వినిపించినప్పుడు మగత నిద్రలోఉన్న కడకరైఒళ్ళు గగుర్పొడిచింది. లేచి సత్రంతాతకంటబడకుండా బయటపడ్డాడు. 'ఆనకట్టై'కి చెరుకు ముక్కలంటే ఎంతో ఇష్టం. కింబన్‌కి కొబ్బరికాయలంటే ఇంకేమీ అక్కర్లేదు. ఇప్పుడివన్నీ ఎక్కణ్ణించి తెస్తాడు? తండ్రి ఎకరన్నర పొలంలోకి వెళ్ళి, పున్నచెట్టు కొమ్మల్లో అరవై అడుగుల ఎత్తున ఆకులూ కొమ్మలతో పదిలంగా చేసిన గాదిలోనుంచి రాగులూ, చోళ్లూ, అరిటిపళ్లూ బయటికితీసి పంచెలో భద్రపరుచుకుని ఏనుగులరాయి దగ్గిరకి ప్రయాణమయ్యాడు.

కడకరై రాత్రిళ్ళు సత్రంవిడిచి వెళుతున్న విషయం ఆట్టేకాలం దాగలేదు. ఆడసత్రంలో అమ్మాయిలకోసం వెళుతున్నాడని నిందవేసారు. పంచాయితీ ఏర్పాటు చేసి శిక్ష వెయ్యాలన్నారు. 'తను ఏ అమ్మాయికోసమూ వెళ్ళడం లేద'న్నాడు కడకరై. కాని ఎక్కడికి వెళుతున్నాడో చెప్పలేదు. చెపితే ఆటంకాలు పెడతారని అతనిభయం.

# ★ ఏనుగుల రాయి ★

ఆడనక్షత్రంలో ఎవరిని కలుసుకోడానికి వెళుతున్నదీ నిరూపించలేకపోవడంవల్ల అతన్ని దండించలేదు. కాని కొందరు పెద్దలు రాత్రుల్లు పొదల్లో పొంచి అతను ఎక్కడికి వెళ్ళుతున్నదీ కనిపెట్టడానికి ఉపక్రమించారు. దానితో రహస్యం బయటపడిపోయింది. పెద్దలు ఇంతపిచ్చికూడదన్నారు. తల్లీ తండ్రీ దయాగా భయాగా వారింప చూశారు. బయట స్నేహితులు ఘీంకారించి పిలుస్తుంటే ఎంత ప్రయత్నించినా కడకర నక్షత్రంలో నిద్రపోలేకపోయాడు. కడకర తండ్రికి పరిస్థితి అర్థమైంది కొడుకు స్వేచ్ఛని అరికట్టి ప్రయోజనంలేదని పెద్దలకి నచ్చచెప్పి ఒప్పించాడు.

ఈ వేసంగికి కడకర ఏనుగులరాయి దగ్గరకి వెళ్ళగానే కళ్లనీళ్ళు తిరిగాయి. అక్కడ ఏనుగులు లేవు. అవి బసచేసుకున్న స్థలం లేదు. దట్టమైన అరణ్యం లేదు. అడవికొట్టి మెక్ నాటన్ టీకంపెనీ అక్కడ నర్సరీ ఏర్పాటుచేసింది. చల్లని ఆకుపందిళ్ల కింద కళకళలాడే టీనారు. ఆ నారుని అడవి మృగాలు తొక్కి పాడు చెయ్యకుండా చుట్టూ కొయ్యలకికొట్టిన ముళ్లతీగ. ముళ్ళతీగకి ఆనుకుని ఏనుగులరాయి. ఏనుగులరాయి పేరుకిమాత్రమే అక్కడ పడిఉంది. ఏనుగులకి చిక్కకుండా మనిషి లోపల దూరి దాక్కోడానికి ఇంక అది పనికిరాదు. రాయిలోదూరే సన్నటి ద్వారాన్ని టీకంపెనీ తాపీమేస్త్రీలు వెడల్పుచేసి పగలగొట్టిన రాతిముక్కలతో నర్సరీ అంచులు కట్టారు. ఇప్పుడు రాతిలోపల ఇద్దరు కూర్చోడానికేకాదు అరడజనుమంది పడుకోడానికి స్థలంఉంది. ద్వారందగ్గిర రాతిముక్కల్ని పగలగొట్టి తీసెయ్యడంవల్ల రాయిబలం తగ్గిపోయి, మధ్యలో పెద్ద బీటవేసి కొద్దిగా ముందుకివాలింది. కడకరకి దుఃఖం పెల్లుబికివచ్చింది. సంబాళించుకుని విచారించవలసినపని లేదనుకున్నాడు. ఏనుగులరాయి ఎలా పోతేనేం? ఇంక దానిఉపయోగం లేదు. అడివి నరికి మనిషి పనిచెయ్యడం మొదలుపెట్టాక ఏనుగులు ఆపరిసరాలకి రావు. ఇంక ఏనుగులు రావు. ఆనకై, ఫీంబన్ పైలన్, కరుప్పాయీ అక్కడికి రావు. కడకరకి తిరిగి దుఃఖం కట్టలు తెంచుకుని వచ్చేసింది. మొలకి చాలీ చాలకుండా కట్టుకున్న పంచె చెంగుతో కళ్లు మొహం తుడుచుకున్నాడు. ఏనుగులకోసం తెచ్చిన కొబ్బరికాయలూ అరటిపళ్ళూ రాయి దగ్గర పెట్టి స్నేహితుల్ని వెతకడానికి బయల్దేరాడు.

ఎంతోదూరం వెళ్లకుండానే కడకరకి ఏనుగుల జాడ కనిపించింది. తన్ని కలుసుకోడానికి రాతిసమీపానికి వచ్చి నరికిన అడివిని చూసి పారిపోతూ ఉన్నమాట. దగ్గరలోనే ఉన్న సెలయేటికి పోయి ఉంటాయి. కడకర ఏటిఒడ్డుకి పరిగెత్తాడు. ఏనుగులు స్నానం చేస్తున్నాయి. కొత్త పరిసరాల్లో కడకరకి స్నేహితులమీద నమ్మకం కొంచెం సడలినట్టయింది. దగ్గిరకి వెళ్ళడమా, మానడమా అని తటపటాయించాడు. చెట్టుచాటున నక్కి మృదువుగా తన రాగం తీశాడు—"కూ-లా-[illegible]-డా-" తొండంతో నీళ్ళు వీపుమీద చిమ్ముకుంటున్న కులకడా వెనక్కి తిరిగి, చేటచెవులు రిక్కించి చూసింది. కడకర మొహం వికసించింది. మళ్ళీ పాడాడు.—"ఫీం-బా-న్-" ఫీంబన్, పాట వచ్చినవైపు ఒక అడుగు ముందుకేసి వచ్చింది. కడకర అనుమానం ఇప్పుడు తీరిపోయింది. ఎక్కడున్నా అవి తన స్నేహితులే. చెటుచాటు నుంచి వచ్చి ఏనుగుల ముందర నిలబడ్డాడు. కడకర, ఏనుగులూ ఏదో మూగభాషలో కూడ పలుక్కున్నారు. అంతా ఏనుగులరాయి దగ్గర చేరుకున్నారు. ఎంత రూపు మారిపోయినా ఏనుగులరాయిమీద మమకారం కడకరని వదలలేదు. తమ స్నేహం మొదలయింది అక్కడ. పెంపొందింది అక్కడ. అక్కడ చేరగానే అతని మనస్సు ఉప్పొంగిపోయింది.

మర్నాడు పొద్దున్న మెక్ నాటన్ టీకంపెనీ కూలీలు పనిచెయ్యడానికి నర్సరీ దగ్గిరకిపోయి ఏనుగులవల్ల కలిగిన నష్టం చూశారు. టీనారు పాడవలేదుకాని ఏనుగులరాయికి ఆనుకొని వేసిన ముళ్ళతీగలూ

కొయ్యముక్కలూ ధ్వంసంఅయిపోయాయి. వెంటనే కంపెనీ వాటిని బాగుచేయించింది. మళ్లా మర్నాడు అదే కథ. ఈసారి కంపెనీ తీగని బాగుచేయించడంతో ఊరుకోలేదు. రాత్రి నలుగురు కూలీల్ని కాపలా పెట్టింది.

కడకరైకి మళ్ళీ సమస్య ఎదురైంది. కూలీలు నర్సరీచుట్టూ పెద్ద పెద్ద మంటలు వేసుకొని కూర్చున్నారు. మంటల్ని చూస్తే ఏనుగులకి భయం. పరిసరప్రాంతాల్లో కనిపించవు. విధిలేక కడకరై ఏటిదగ్గిర ఏనుగుల్ని కలుసుకునేవాడు. ఏటి దగ్గిర కలుసుకున్నా రాయిదగ్గర కలుసుకున్నా అవే ఏనుగులు. అయినా అతని మనస్సంతా ఏనుగుల రాయిమీదే ఉండేది. ఆ రాతిగుహలో కూర్చుని కులకడానికి పళ్ళు తినిపిస్తే 'లచ్చి' తొండానికి ఆకులుఅందిస్తే అతని మనసు తృప్తిగా ఉంటుంది.

పారంరోజులు రాత్రికాపలా పెట్టిన తర్వాత ఏనుగుల భయం పోయిందని మెక్‌నాటన్ కంపెనీ ఉపేక్షచేసింది. రాత్రి ఇంటిదగ్గిర భోజనంచేసి ఏటిదగ్గిర ఏనుగులకి పళ్ళు తీసుకువెళుతున్న కడకరై రాయి దగ్గిర కాపలా కూలీలు లేకపోవడం గమనించాడు. వీంబన్, ఆనకట్టై అని ఉద్రేకంగా అరుచుకుంటూ ఏటి దగ్గిరికి పరుగెత్తాడు.

కొంతసేపటికి స్నేహితులంతా మళ్ళీ ఏనుగుల రాయిదగ్గర జేరుకొన్నారు.

కడకరై మధురస్మృతుల్లో మైమరిచి పోయాడు. పూర్వంలాగా రాతిలోపల కూర్చుని ఏనుగులకి పళ్ళు అందించాడు. ఏనుగులు సంతోషంతో మిన్నుముట్టేలా ఘీంకరించాయి; విలాసాల్లో మునిగి పోయాయి. అంతా కోలాహలంగా ఉంది.

అంత సంతోషం ఎంతోసేపు నిలబడలేదు. ఏనుగులు ఆడి ఆడిరాతికి శరీరాన్ని గుద్దుకోడం ప్రారంభించాయి. పూర్వం రాయి బలంగా ఉండి వాటితాకిడికి ఆగేది. ఇప్పుడు బీటవారిపడిపోడానికి సిద్ధంగాఉండి నిలబడిలేకపోయింది.

ముందుకి వాలిఉన్న భాగం బ్రహ్మాండమైన చప్పుడుతో కూలిపోయి లోపల ఉన్న కడకరైని ఉక్కిరి బిక్కిరిచేసేసింది.

కడకరై ఒక్క అరుపు అరిచాడు.

మరుక్షణం రక్తపుముద్దగామారిపోయాడు.

జరిగిన సంగతి ఏనుగులు గ్రహించాయి. క్రూర ఆవేశం వాటిని ఆవహించింది. చుట్టుప్రక్కలవున్న నర్సరీని సర్వనాశనం చేసేశాయి. పందిళ్ళని పీకి ముక్కలు ముక్కలు చేశాయి. టీముక్కల్ని ఆనవాలు పట్టలేనంతగా తొక్కాయి. ముళ్ళతీగని దారపు ఉండలాగా చుట్టి దూరంగా విసిరికొట్టేయి. నర్సరీఅంచులకి ఉపయోగించిన రాళ్ళని ఇసుకరేణువులుగా నలిపేశాయి. విడిపడి పోయిన రాతిని దొర్లించి కడకరైని బయటికి లాగాయి.

మర్నాడు పొద్దున్న నర్సరీలో పనికి వెళ్లిన కూలీలు కడకరైని మోసుకుపోతున్న ఏనుగులమందని చూసి భయపడి పారిపోయారు.

మళ్ళీ నర్సరీ వెయ్యడానికి కంపెనీ పదిసార్లయినా ప్రయత్నించింది. ప్రతిసారీ ఏనుగులు మందలుమందలుగా వచ్చి రూపులేకుండా చేసిపోయాయి. రాత్రిళ్ళు మంటలు వేసుకుని కూలీలు కాపలా వుండేవారు. మంటలారిపోయేవరకూ వుండి నర్సరీని ధ్వంసంచేసేవి ఏనుగులు. ఒక్కొక్కప్పుడు పట్టపగలే దాడిచేసేవి. పగబట్టిన ఏనుగులతో పోట్లాడటం వృథాప్రయాస అని స్టీవెన్సు దొర నర్సరీని ఇంకొకచోటికి మార్చేశాడు.

* * *

తంగముత్తు చెప్పడం పూర్తిచేశాడు. సిమ్సన్సు దొర సందిగ్ధావస్థలోపడ్డాడు. ఆయన నాగరికత ఇదంతా మూఢవిశ్వాసమేమోనని కలవరపెట్టింది. మనస్సు నమ్మమని ప్రోత్సహించింది. నెమ్మదిగా జేబులోనుంచి పొగాకు తీసి పైపులో కూరుకుని అగ్గిపుల్లగీసి అంటించాడు. "ఇంక మనం కథలు చెప్పుకోడం మానేసి కొంచెం పని చేస్తే బాగుంటుందేమో, ఎంతలేదన్నా కంపెనీ జీతంరాళ్ళు ఇస్తూంది కదా!" అని నవ్వాడు.

"బౌనుసార్," అన్నాడు తంగముత్తు. ★

# బాల సాహితి

# ఇద్దరు స్నేహితులు

## చల్లా రాధాకృష్ణశర్మ

పూర్వం రామాపురం అనే గ్రామంలో ఇద్దరు స్నేహితులు ఉండేవారు. ఒకడిపేరు శరభయ్య. మరొకడిపేరు శివయ్య.

శరభయ్య చాల మంచివాడు. ఒకళ్ల జోలికి వెళ్లేవాడు కాదు. తన పనేమో, తాకేమో. పెద్దలు సంపాదించి యిచ్చిపోయిన ఆస్తిపాస్తులతో ఎంతో హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు. శరభయ్య భార్య పేరు కామాక్షి. ఆమె భర్తకు తగిన భార్య. ఆమె నోట్లో నాలుక లేదు. ఆలు మగలిద్దరూ మంచివాళ్లు కావడంవల్ల వాళ్లజీవితం హాయిగా గడిచిపోతోంది.

శివయ్యకూడ ధనవంతుడే. రామాపురంలో అతనికి గుడ్డలకొట్టు ఒకటి ఉన్నది. పొద్దస్తమానం ఆకొట్టుమీదే కూర్చునేవాడు. ఎవరిమైనా అతనికి నమ్మకం కొంచెమైనా ఉండేది కాదు. తాను తప్ప ఇతరులంతా మోసగాళ్లనీ, కనుక ఎవర్నీ నమ్మకూడదనీ అతని అభిప్రాయం. చివరికి భార్యను కూడా నమ్మేవాడు కాదు. అతని భార్యపేరు సరస్వతి.

ఆమెనుచూచి 'సరస్వతి శివయ్యతో ఎలా జీవిస్తున్నదో పాపం!' అని అనుకునేవాళ్లు ఆ యిరుగు పొరుగులవున్న అమ్మలక్కలు. సరస్వతి ఎంతమంచిదో శివయ్య అంత చెడ్డవాడు. చీటికి మాటికి అతను భార్యమీద కస్సుబుస్సులాడేవాడు. ఒక్కొకసారి ఆమెమీద చెయ్యి చేసుకునేవాడు కూడా.

ఒకనాడు శివయ్య సరస్వతిని నడిబజారులో కొప్పుపుచ్చుకొని కొట్టాడు. ఆదృశ్యం చూచి అందరూ నవ్వారు. సరస్వతి, నాలుగురోజుల పాటు వీథిమొహం చూడలేదు. అంత సిగ్గుపడింది ఆమె. ఆనాటి నుంచీ భర్త అంటే సరస్వతికి ఎంతో అసహ్యం కలిగింది. మొదట్లో ఎంత శాంతంగా ఉండేదో, ఇప్పుడు అంత గయ్యాళిగంపగా తయారయింది ప్రతిరోజూ సరస్వతికీ, శివయ్యకూ మాటపట్టింపులే. వాళ్ల యింట్లో ఏదో ఒక గొడవ. ఒకరి నొకరు కసి తీరేటట్లు తిట్టుకునేవారు. ఇలా కాలం గడిచేకొద్దీ శివయ్యకు భార్య అంటే భయం ఏర్పడింది.

విచిత్రమేమంటే చెడ్డవాడైన శివయ్యకూ, మంచివాడైన శరభయ్యకూ మధ్య గాఢమైన స్నేహం ఏర్పడింది.

ఒకనాడు ఆ యిద్దరు స్నేహితులూ కలిసి పొరుగూరికి బయలుదేరారు. ఇద్దరూ పెరుగన్నంమూట కట్టుకొని ప్రయాణమైనారు.

కామాక్షి తియ్యని గడ్డ పెరుగులో వేడిఅన్నం కలిపింది. అందులోకి నంచుకునేందుకు నిమ్మకాయ బద్దలూ, నూనెలో వేయించిన పూరమెరపకాయలూ ఉంచింది. నవ్వుమొగంతో శరభయ్యను సాగనంపింది.

తన భర్త పొరుగూరికి వెళ్లడం సరస్వతికి సంతోషం కలిగించింది. ఒక్కనాడయినా కమ్మని భోజనం కడుపునిండా తినవచ్చుననీ, భర్తమీద ఉన్న కోపాన్ని తీర్చుకోడానికి సమయం వచ్చిందని ఆమె అనుకుంది. ఆమె ఏం చేసిందంటే — కాటుపోయిన పెరుగులో పాచిపోయిన అన్నం కలిపింది. నంచుకునేందుకు గొడ్డుకారం, నిప్పుసెగమీద వేయించిన ఎండు మెరపకాయలూ ఉంచింది. ఈ విషయం పాపం శివయ్యకు తెలియదు.

కాలినడకన ఆ యిద్దరు స్నేహితులూ ప్రయాణం సాగించారు. కొంతదూరం వెళ్లేసరికి వారికి ఆకలయింది. పైగా అన్నంమూటల్ని చూచేకొద్దీ వాళ్లకు నోరూరింది. ఇద్దరూ ఒక మర్రిచెట్టునీడకు చేరారు. ఆ మర్రిచెట్టును ఆనుకొని ఒక చిన్నచెరువు కూడా ఉన్నది.

(48 వ పేజీ చూడండి)

# విమానం కథ

పి. దక్షిణామూర్తి

(గతవారం తరువాయి)

అతగాడు ఊళ్ళో పదిమందినీ కేకేసి తెచ్చి, "ఏవర్రోయ్ నేను స్కాట్‌లెండ్‌నించి ఫ్రాన్సుదేశానికి ఎగిరివెళ్తాను, చూసుకోండి మరి, కాసుకోండి మరి" అన్నాడు.

జనంఅంతా నవ్వి చప్పట్లు కొట్టారు.

అతను పక్షి ఈకలతో ఒకజత రెక్కలు తయారుచేసి, వాటిని తనజెబ్బలకు తగిలించుకున్నాడు. అవటా స్టర్లింగ్ కాసిల్ అనే ఒక పెద్దభవనంమీదికి ఎక్కాడు. అక్కడ నుంచుని బాణీవాళ్లు చేసేటంత గోలచేశాడు. అంతే ఒక్కసారిగా ఝామ్మని ఆవైనించి ఫ్రాన్సుదేశం వేపు దూకేసి రెక్కలు ఆడించాడు. అయితే నేంతనుఅనుకున్నట్టు ఫ్రాన్సుదాకా వెళ్ళలేకపోయాడు. ఎందుకంటే దూకీదూకగానే సరాసరి ఆమేడ తాలూకు గోడదగ్గిరనానే దభీమని పడిపోయాడు.

చుట్టూ ఉన్నవాళ్లందరూ గొల్లుననవ్వి, చప్పట్లుకొట్టి వెక్కిరించారు. అయితేనేం కిందపడిన ఆ పెద్దమనిషిమాత్రం సిగ్గుపడి తల దించుకోలేదు. "మావయ్యా, చూడు వీళ్ళు వెక్కిరిస్తున్నారు"అని ఏడవలేదు. బట్టలు దులుపుకుంటూలేచి, అప్పటికి తోచిన కారణం ఒకటి చెప్పేశాడు. "పొండయ్యా! నేను కాకి ఈకలరెక్కలు కట్టుకున్నాను గాని, అదే డేగవైతే తప్పకుండా ఈపాటికి సగందూరం ఎగిరి వెళ్ళేవాడినే. పొరపాటైంది"అన్నాడు.

ఇలా ఎవరేనా హేళనచేసినా సిగ్గుపడకుండా తిట్టినా భయపడకుండా పట్టుదలతో ... ఆరోజుల్లో ఇలాటివాళ్ళు ప్రయత్నించేశారు కాబట్టే ఇవాళ విమానాలిట్లా ఇలా ఎగురుతున్నాయి. ... ఇలా ప్రయత్నాలు చేయడానికీ, ఎగరాలి అన్న ఊహ రావడానికి ... ముఖ్యంగా గద్దలు, గబ్బిలాలూ

... పూర్వం 400 సంవత్సరాలక్రితం ... ఆయన ఇలాగే గబ్బిలాలను ... తనూ ఎగరాలనుకున్నాడుట. ... ఎందుకైనా మంచిదని, ముందర ఒక పక్షిని తయారుచేస్తే బాగుంటుందనుకున్నాడు. కర్రతో ఒకటి తయారుచేసి, గబ్బిలంలాగా దానికి గుడ్డతో రెక్కలు అమర్చి ఎగరేశాడట.

ఈ కట్టుకథలూ, పిట్టకథలూ ఎలా ఉన్నా ఆకాశంలో మనుషులు ఎగరాలి అన్న ఆలోచన దాన్నిగురించిన గొడవ 1750 ప్రాంతాలలో బయల్దేరి, 1800 ప్రాంతాలలో పుంజుకుని, 20వ శతాబ్దంలో జోరు హెచ్చి దరిమిలా బాగా పేట్రేగిపోయింది.

అంతకుముందు ఏవో ప్రయత్నాలు అంతంతగా జరిగాయి. కథలు కావులే. చరిత్రలో మనకి తెలిసిన మనుషులు చేసినవన్నమాట.

లియనార్డో డావిన్సీ అనే పేరు విన్నావా? ఆయన ఇటలీవాడు. బలే గట్టివాడు కూడా. చిత్రకారుడుగా ఆయనకు పేరు ఉంది. ఇంకా చాలా సంగతులు తెలుసు. అసలాయనకి అక్కరలేని విషయం లేదు. అన్నిటి గురించీ తెలుసుకున్నాడు. ఎన్నెన్నో ఆలోచించేవాడు. ఎన్నో కనిపెట్టేవాడు. ఆయన 15వ శతాబ్దం చివరి భాగంలో—అంటే 149 ప్రాంతాలలోనే విమానాల గురించి ఆలోచన చేశాడు. ఒక పుస్తకం కూడా రాసేశాడు. అందులో విమానాలు ఎలా ఉండాలో, వాటిని ఎలా ఎగరేయవచ్చునో చూపిస్తూ బొమ్మలు కూడా వేశాడు. అయితేనేం. ఆయన ఎగిరి చూపించలేదనుకో.

దాదాపు వందేళ్ళ తర్వాతఇంకో ఇటాలియను విమానాల మీద ఇంకో పుస్తకం రాశాడు. ఆయనపేరు ఫ్రాన్సిస్ లానా. అందులో ఈయన బెలూనాలు అనేవి పైకి ఎగరతాయని చెప్పి, అవిచేసే పద్ధతి చూపిస్తూ బొమ్మలు వేశాడు. ఇంకోరకం విమానం లాటిదికూడా ఆయన చూపించాడు. ఇక్కడ బొమ్మ ఉంది చూడు. అలాగ ఒక చిన్న పడవ తయారు చెయ్యాలిట. రాగి రేకుతో నాలుగు గోళాలు తయారుచేసి వాటిని ఆ పడవకి ఆ చివరా ఈ చివరా అమర్చాలి. మామూలు పడవలలాగే తెరచాపా చుక్కానీ పెట్టమన్నాడు.

ఆ రాగి గోళాల్లోంచి గాలితీస్తేనే అవి తేలికపడి పైకి ఎగురుతాయనీ అప్పుడు వాటితోపాటు పడవకూడా పైకి లేస్తుందనీ ఈయనరాశాడు. అప్పుడేమో ఈ తెరచాపా చుక్కానీ, వాడుకుని మన ఇష్టం వచ్చిన ఊరుకి ఎగిరి వెళ్ళవచ్చునన్నాడు.

ఊహామంచిదే కాని, నిజంగా యిది ఎగరడానికి వీలులేదు. ఎందుకంటే, రాగిగోళాల లోంచి గాలితీసేస్తే బయటిగాలి వాటిలోకి పోవాలని ప్రయత్నిస్తుంది. ఆ తోపిడిని తట్టుకోవాలంటే ఈ గోళాలగోడలు దళసరిగా బలంగా ఉండాలి. గోడ దళసరి అయితే గోళం బరువు ఎక్కువ అవుతుంది.



పడవలాంటి విమానం




# ★ విమానం కథ ★

బరువెక్కువైతే గోళమే ఎగరదు. ఇంక తేలికెలా తేలుతుంది? అదీ సంగతి.

ఇదేదో బయటిగాలి లోపలికి, లోపలి గాలి బయటికీ తోసుకు రావడం ఏమిటి అని తికమకపడకు. గాలి బుద్ధి అంతేలే. అరుగుమీద నీళ్ళుపోస్తే అవి గోడ్డుమీదకి ఉరుకుతాయి గదా. అలా నీరు పల్లానికి పోయినట్లే గాలికూడా ఖాళీగా ఉన్న చోటుకి దూకుడుగా పోతుంది. ఖాళీయే కాదు. గాలితక్కువైన చోటుకికూడా వెళ్ళిపోతుంది. మనకి కనబడదనుకో. కొందరికి చూడు, పక్కింటి వాళ్ళు ఏం చేస్తున్నారో ఏం తింటున్నారో అని ఉంటుందిగదా. కాస్త అలికిడి అయితే చాలు, వీళ్ళకళ్ళూ చెవులూ బుద్ధీ అన్నీ అటు పరిగెడతాయి. గాలిగుణంకూడా అంతేనన్న మాట. ఎక్కడకాస్త చోటు దొరికినా తోసుకు వచ్చి దూరిపోతుంది. గాలిలేని చోటు లేదు. నీ చుట్టూ, మీ యింటిచుట్టూ, మా ఊరిచుట్టూ, ఈ భూగోళంచుట్టూ అంతటా గాలివుంది. గాలి బలమైనది. గాలికి బరువుంది. పరిగెట్టినపుడూ, సైకిలు తొక్కినపుడు, రైల్లో వెళ్తు కిటికీలోంచి చెయ్యి బయటకు జాపినపుడూ గాలిబలం ఏమిటో గాలి జోరు ఏమిటో బాగా తెలుస్తుంది.

ఇంక బరువంటావా. నువ్వు అరచెయ్యి జాస్తే, చదరపు అంగుళానికి 14 పౌనుల బరువుమోస్తున్నావన్నమాట. విమానంలాటివి వేగంగా ఎగురుతూ పోతున్నపుడు దాని రెక్కలమీద చదరపు అంగుళానికి 14 ఏనుగుల బరువుంటుంది. ఇవన్నీ గబుక్కున తెలీవనుకో. గాలినితూకం వేస్తే బరువు తెలుస్తుంది. అంటే మామూలు కాటాలూ తక్కెడలమీద కాదనుకో. దీనికోసం సున్నితమైన త్రాసులుంటాయి. అద్దాలపెట్టెలో పెడతారు వాటిని. ఒఖాళీ సీసా తీసుకో. అది ఎంత ఖాళీఅయినా గాలిఉంటుంది. దాన్ని ముందర తూచాలి. అది సీసా, గాలీ కలిపి తూగే బరువన్న మాట. తరవాత, సీసాకు చిల్లున్న బిరడాపెట్టి పంపుతోటి అందులో గాలిని తీసేసి (దానికిసగుపాయాలుంటాయిలే. నువ్విప్పుడవేవీ చెయ్యొద్దు) ఆ ఖాళీసీసాని తూచాలి. అప్పుడు ఇందాకటి బరువునుంచి ఈ బరువుని తీసేస్తే సీసాలో గాలి బరువు తెలుస్తుంది. ఈ కొంపోజీవన్‌అంతావిసుగ్గాఉంటుందనుకో. అయినా చాలా ఆలోచించి తిప్పలుపడి ఎవరో గాలికి బరువుందని ఏనాడో ఆ సంగతి కనుక్కున్నారు కాబట్టి, గాలికన్న తేలికైనది గాలిలో తేలుతుందనీ ఇంకెవరో కనుక్కున్నారు. అలా అయితే బెలూన్లు తయారుచేసి ఎగరవేయవచ్చునని మరెవరో అన్నారు. అలా కొందరు ఎగిరి[illegible] ఇంకోలా ఎగరొచ్చునని ఇంకోరు అనుకున్నారు. 170 ఏళ్ల క్రితం ఏమయిందో తెలుసా? ఇప్పుడిలా అంటే నవ్వొస్తుంది కాని, అప్పుడు గొప్పే. గాలికి బరువుందని కాకుండా, వేడిగాలి చల్లగాలికన్న తేలిక అనికూడా కనుక్కున్నారు.

—(ఇంకా వుంది)

## బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

...పల్లి భాస్కరరావు [బెంగుళూరు] ...భగవతీ భవాని [ఝర్సగోడ్, పూరీ ...] ...వె. పద్మనాభరెడ్డి [పత్తికొండ, ... జిల్లా] సివ్వాం సరస్వతి [శ్రీకా...] ...కస్తూరిబాయి [మద్రాసు] ఎస్. ...పతంజలిబాబు [మద్రాసు] కుచ్చి ...లలిత [విశాఖపట్నం] కె. యస్. ... [తొర్రేడు, తూ. గో. జిల్లా] ఎ. ...మోహన్‌రావు [ఏలూరు] వో...టి [కరీంనగరం] జంధ్యాల గురుచరణ [శ్రీకాకుళం] ఎమ్. దుర్గాప్రసాద ...పట్నాయక్ [పాలకొండ, శ్రీకాకుళం ...] ...పెందేకంటి మీనాక్షమ్మ [తాడి ... అనంతపురంజిల్లా] చోడవరపు వెంక...రావు [కోలవెన్ను, కృష్ణాజిల్లా] మహమ్మద్ ఉస్మాన్ [కాకినాడ]. ...హరినాదశెట్టి [తిరుపతి చిత్తూరు ...] భమిడిమర్రి దుర్గాప్రసాద్ [జమ్...పూర్] వై. మృత్యుంజయశాస్త్రి ...పూరి] వి. సూర్యనారాయణరెడ్డి [కను...ల అనంతపురంజిల్లా] కె. కామేశ్వర... [హైదరాబాదు] యిమ్మిడి శెట్టి... [అనకాపల్లి, విశాఖజిల్లా] పోణంగి ...చంద్రమూర్తి [కొవ్వూరు ప. గో. ...] ...పాటి సత్యనారాయణరెడ్డి ...రామేశ్వరం ప. గో. జిల్లా] మంచలి ...కృష్ణ భీమన్నారాయణరావు ...] పారనంది రామకృష్ణారావు ...కుళం] లింగరాజు వెంకటసుబ్బా... [ఒంగోలు గుంటూరుజిల్లా] ఎమ్. ...గాధర తిలక్ [పోలవరం ప. గో. ...] వెలగపూడి రామచంద్రబోస్ [అకు... కృష్ణాజిల్లా] పంతుల వెంకటసత్య...రరావు [గుంటూరు] తోటప్రమీలా [గుంటూరు] యలమర్తి చినలక్ష్మయ్య ...మండ్రి] యలమర్తి చినలక్ష్మయ్య ...మండ్రి] ఇల్లపని బాలనాగేశ్వరరావు ...ల ప. గో. జిల్లా] వల్లభాపురపు ...నారాయణ దుర్గావరప్రసాద్ [పట... కృష్ణాజిల్లా] సాతులూరు కోటేశ్వరమ్మ ... నెల్లూరుజిల్లా]

...పార్వతీదేవి (చీరాల) తటవర్తి ... (రాజోలు తూ.గో. జిల్లా) చిలక... ...రామయ్య (ఇంకొల్లు గుంటూరుజిల్లా) ...పర్వతవర్ధనమ్మ (కాకరపర్రు, ...జిల్లా) గురజాలపాప (గుంటూరు) ...నాగేశ్వరరావు (మచిలీపట్నము) ...గంగాధరరావు (మచిలీపట్నం) ...టి వెంకటవిజయలక్ష్మి (న్యూఢిల్లీ)

మునుమర్తి వెంకటసీతారామయ్య (కాకినాడ) మేకల కృష్ణకుమారి (నూజివీడు కృష్ణాజిల్లా) భమిడి వెంకటరమణారావు (రాజోలు తూ. గో. జిల్లా) కె. విజయకుమారి (విజయవాడ) ముక్కా దేవేంద్రనాథ్ గుప్త (నిజామాబాదు) విజయలక్ష్మి (హన్నవాడ మహబూబ్ నగర్ జిల్లా) కాకుమాను రామప్రసాద్ (తెనాలి) వంకినేని సుజాత (బాడంగి శ్రీకాకుళంజిల్లా) మర్ల సరళకుమారి (కాకినాడ) వి. ఎన్. వసుధ (తుంగభద్రా డామ్, హోస్పేటజిల్లా) ఎల్. సులోచనాకుమారి (కర్నూలు) ఎమ్. ఈశ్వర నాగమణి (తుని తూ.గో.జిల్లా)

పాతూరి రత్నకుమారి (గారపాడు కృష్ణాజిల్లా) పి. ఉదయకుమార్ (చినయరుకపాడు కృష్ణాజిల్లా) వెలగా సూర్యనారాయణ (మునగపాక) పి. పూర్ణచంద్రకుమారి (గుంటూరు) ఎమ్. రుక్మిణి (అచ్చెటపల్లి ...హోసూరు తాలూకా) దూలం రామమూర్తి (కరీంనగర్) పర్వతరాజు నాగేంద్ర (మదనపల్లి చిత్తూరుజిల్లా) కొల్లా నాగప్రసాద్ (తణుకు) వెలువోలు అరవిందబాబు (అమృతలూరు గుంటూరు జిల్లా) పింజరపు ఆచారి (సాలూరు శ్రీకాకుళం జిల్లా) ఎస్. ఎస్. కృష్ణకుమారి (కర్నూలు) యల్లాప్రగడ రామమోహన్ శర్మ (విజయనగరం) నేమాని గౌరీపతి శాస్త్రి (విజయనగరం) ఇవటూరి భ్రమర (వేములగంట ప. గో. జిల్లా) భూపతిరాజు కాంతి (నిడదవోలు ప. గో. జిల్లా) కొట్రగడ్డ బుచ్చి సుందరరావు (గుడివాక కృష్ణాజిల్లా) సూరపనేని లక్ష్మీకుమారి (గుడివాక కృష్ణాజిల్లా) రావిపూడి నాగమల్లేశ్వరీదేవి (కరీంనగరము) ఇవటూరి భానుమూర్తి (శ్రీకాకుళం) చింతలపాటి లక్ష్మీనరసింహ ప్రసాద్ (యనమదల).

కోసేటి కన్నిక (తిరుత్తణి) బండ్ల భాస్కరరావునాయుడు (అంబత్తూరు చెంగల్పట్టు జిల్లా) యర్రమిల్లి శేఖర్ (కాకినాడ) పన్నాల కామేశ్వరి (వరంగల్లు) కె. ఫణిరాజ్ (హైదరాబాద్) దివాకర్ల రామమోహన్‌రావు (సికింద్రాబాదు) ★

## రంగులరాట్నం-10. వాల్ట్‌డిస్నీ




"తూకంగా తినమంటే వింటేగా... చూడు ఎలా ఒరిగిపోయిందో"

# ★ ఇద్దరు స్నేహితులు ★

[44-వ పేజీ తరువాయి]

చల్లని మఱ్రిచెట్టునీడ, చల్లని చెరువు గాలి — ఈ రెండూ ప్రయాణం బడలికను తీర్చాయి.

శరభయ్య అన్నంమూట విప్పి నోట్లో రెండు ముద్దలు వేసుకున్నాడు. "ఆహా! ఎంత రుచి— ఏమిరుచి! కామాక్షి ఎంతమంచిది,' అని యిలా లోలోన అనుకున్నాడు. లొట్టలు వేసుకుంటూ ఆ అన్నం తిన్నాడు.

పాపం! శివయ్యకళ్లలో నీళ్లు తిరుగసాగాయి. ముఖం అదోవిధంగా మారిపోయింది. ఒకముద్ద తిననూ, ఒక చెంబెడునీళ్లు తాగనూ. అలా శివయ్య సరస్వతి కలిపియిచ్చిన పెరుగన్నం, తింటున్నాడు. మధ్య మధ్య పెద్ద పెద్ద తుమ్ములు. ఆ గొడ్డుకారమూ, నిప్పుసెగమీద వేయించిన మెరపకాయలూ అంత పని చేస్తున్నాయని తెలుసుకున్నాడు. ఆ అన్నం యావత్తూ పారవేద్దామనుకున్నాడు. అలా చేస్తే శరభయ్య ఏమనుకుంటాడో మరి! ఒకవైపు ఆకలి. ఒకవైపు భార్య మీద కోపం. మరోవైపు సిగ్గు!

మిత్రుడు పడుతున్న అవస్థను పసికట్టి శరభయ్య, "ఏం శివయ్యా- అన్నం నసిగా లేదా ?" అడిగాడు.

శివయ్యకు చచ్చినంత పని అయింది. తన అవస్థను మిత్రుడు గ్రహించాడని అనుకున్నాడు. వెంటనే తడుముకోకుండా యిలా అన్నాడు.

"అన్నం బాగానేవున్నది. కాని ఎలా సహిస్తుంది చెప్పు శరభయ్యా. సరస్వతికి నేనంటే ఎంత ప్రేమ అనుకున్నావు? పాపం — ఈయివ్వాళ్ల అన్నం తిన్నదో లేదో —" అని అంటూనే ఒక పెద్ద తుమ్ము తుమ్మాడు. చూచావా-శరభయ్యా! నా మాటలు అబద్ధం అనుకున్నావేమో — ఎలా కొరకపోతోందో చూచావా!"

శివయ్య చెప్పిన మాటలు నమ్మాడు శరభయ్య. కాని లోపల సందేహమే అతనికి. శివయ్యా సరస్వతీ ఎప్పుడూ కీచులాడుకుంటారని అతనికి బాగా తెలుసు.

ఆ తర్వాత శివయ్య ఆ పెరుగన్నం మూటను కాస్తా ఆ చెరువులో పారవేశాడు. రెండు చెంబుల నీళ్లు తాగి 'అమ్మయ్యా' అన్నాడు. అప్పటికిగాని కారం తగ్గలేదు. తుమ్ములు కూడ తగ్గాయి.

శివయ్య చాలా సిగ్గుపడ్డాడు. ... ప్రవర్తనవల్లనే గదా సరస్వతికి ... పైన అసహ్యం కలిగింది ... గ్రహించాడు. అప్పుడతనికి పాతసంగతు ... లెన్నో గుర్తుకు వచ్చాయి. ... అంటే మంచిబడే శివయ్యలో ... తలంపుగా మార్పు ఏర్పడింది.

చివరికి స్నేహితులిద్దరూ ... వలసిన ఊరు వెళ్లారు. వెళ్లిన పని ... చూచుకొని తిరిగి రామాపురం ... చేరుకున్నారు. అప్పటికి మసక ... పడింది.

శివయ్య నరాసరి యింటి ... వెళ్లాడు. భర్త త్వరలో తిరి... రానున్నకొన్న సరస్వతి రకరకా... పిండివంటలు చేసుకుంటోంది. ఆమెను చూచాడు శివయ్య. ... ఏమీ అనలేదు. సరస్వతీ మా... చాలా భయపడింది.

ఆనాటినుంచీ సరస్వతీ శివయ్య... కీచులాడుకోవడం మానివేశా... ఇప్పుడు శివయ్య అంటే సరస్వతి... ఎంతో గౌరవం!

# ★ పరోపకారి ★

(12-వ పేజీ తరువాయి)

తాటితోపులో సూర్యుడు పొడిచాడు. ఏటివారంతా స్వర్ణ కాంతుల్లో మునుగుతోంది. లివేరులో వున్న పూరిగుడిశెలు బంగారు సద్ధుంటున్నాయి.

బండివచ్చి బాబాయి యింటిముందర ఆగింది.

ఇద్దరూ బండిదిగారు.

శేషాద్రి బాబాయి యింటిదగ్గర వాతావరణం ఏదో భీభత్సంగా ఊహించుకున్నాడు. కాని అటువంటి దేమీ లేక ప్రశాంతంగా వుండటం చూచాక శేషాద్రికి ఏదో అనుమానం వేసింది. "తనతో అబద్ధ మాడిందా సుభద్ర-"— అనుకున్నాడు.

జంకుతూనే గుమ్మం దాటాడు.

అరుగుమీద, పేము కుర్చీలో కాళ్లుచాపి పడుకుని, 'చర్చిల్ సిగార్' అంతసైజులో లంకాకుచుట్ట కట్టకాలుస్తూ పడుకుని వున్నాడు బాబాయి.

గుమ్మంలో వీళ్లను చూడగానే తెల్లబోయాడు బాబాయి. సుభద్రమాత్రం చంటి వాణ్ని భుజాన్న వేసుకుని గబగబా లోపలికి వెళ్లి పోయింది.

బాబాయికి యిదంతా ఏమిటో అర్థం కాలేదు. శేషాద్రిమాత్రం కొయ్యలా నిలబడిపోయాడు. బాబాయంటే చచ్చే భయం శేషాద్రికి.

"ఎక్కడనుంచి రా...? రా..! కూర్చో. నీబడ్డావేం..?" అన్నాడు బాబాయి.

"యిక్కడినుంచే మావయ్యా..!" నసిగాడు శేషాద్రి వెంటనే ఏం సమాధానం తోచక.

"యిక్కడనుం చేమిటి నీ ముఖం..! రామారావేడి..? సుభద్రను యిక్కడ దిగబెట్టమని పంపాడా..?" అన్నాడు బాబాయి.

శేషాద్రి కాస్త తేరుకున్న మీదట, సుభద్ర రైల్లో కలసినసంగతి మొదలుకొని విషయం అంతా చెప్పుకొచ్చాడు.

బాబాయి యిది విన్నమీదట, అసలు విషయం గ్రహించాడు. మళ్లీ వాళ్లిద్దరిమధ్య ఏవో అభిప్రాయభేదాలు వచ్చి వుంటాయి అనుకున్నాడు. సుభద్ర అలిగి, యిలా వెయ్యడం, తను రామారావు దగ్గరకువెళ్లి, చివాట్లు పెట్టో, నచ్చ చెప్పో యిద్దరిమధ్య రాజీ కుదర్చడం పరిపాటే బాబాయికి. అందుకని బాబాయి ఏమంత ఆశ్చర్యపోలేదు ఈవిషయంలో. శేషాద్రికి మాత్రం చాలా ఆశ్చర్య మనిపించింది.. "యిదెప్పటి నుంచి..!" అనుకున్నాడు.

మొత్తంమీద శేషాద్రిచేసిన పనికి చాలా మెచ్చుకున్నాడు బాబాయి.

"మాచావురా శేషాద్రి! సుభద్ర మీఅమ్మకు మేనకోడలు కాబట్టి నువ్వు అభిమానంతో, అది ఒక్కతీ ఏమవుతుందో అనేఉద్దేశంతో వచ్చావు—అరామి గాడికిఅదీ లేదు మాచావా ...?అన్నాడు బాబాయి శేషాద్రి వుబ్బిపోయాడు. నిజమే! సుభద్రతనకు పరాయిదా అనుకున్నాడు.

అసలు విషయం శేషాద్రికి తెలిసిందనే ఉక్రోషంతో సుభద్ర బయట కొచ్చింది గబగబా...పొగదేరిన కళ్ళల్లో నుంచి రోషం బయటకు చిమ్ముతోంది.

"అదికాదుబాబాయి ఆయ నేమీఅనలేదు. నే నే వచ్చాను ఊరుకే చూద్దామని అంతే!" అంటూ లోపలకి వెళ్ళిపోయింది మళ్ళీ.

సుభద్ర ఉద్దేశాన్ని కనిపెట్టి బాబాయి నవ్వేశాడు.

"అవునే!" వాడిమీద అలిగి వచ్చినా, వాణ్ని ఏమైనా అంటే మళ్ళీ వెనకేసు కొస్తావు! నేవున్నాగా మీ యిద్దరి మధ్య రాజీ కుదర్చటానికి అంటూ నవ్వి లోపల కెళ్ళి చంటివాణ్ని ఎత్తుకొచ్చాడు బాబాయి.

మధ్యాహ్నం భోజనాలు అవీఅయిపోయిన తరువాత తాపీగా కూర్చున్నమీద గాని శేషాద్రిని, ఏ పనిమీద వెళ్ళింది, ఎక్కడకు వెళ్ళిందీ అడగలేదుబాబాయి. ఇది అడగ్గానే శేషాద్రికి ఏడో మైకంనుంచి మేలుకొల్పి నట్టయింది.

అవును అసలు తను ఏపనిమీద బయలు దేరాడు తనిప్పుడెక్కడున్నాడు? యిలా జరుగుతుందని ఎప్పుడన్నా అనుకున్నాడా?

శేషాద్రి హడావుడిగాలేచి సంచి అదీ తీసుకున్నాడు.

"వస్తాను మామయ్యా...! బస్ కి టైమవుతుందిగా...!" అన్నాడు శేషాద్రి.

[మిగతా వచ్చేవారం]

# వార్తావరణం

ప్రతిభ, మంచితనంగల ఒక వ్యక్తిని నాటక కళ కోల్పోయింది అన్నారు, లింగమూర్తి.

"ఆయన మాకు గురువు. తండ్రి వంటివారు. మా చిన్నతనంలో ఆయన మాకు ఇచ్చిన అమూల్యమైన సలహాలు, చూపిన మార్గాలూ వాత్సల్యం ఏనాటికీ మరువలేను. ఆయన ఎందరో కళాకారులకు గురుతుల్యుడు." అని నటుడు అక్కినేని నాగేశ్వరరావు సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావూ అన్నారు.

## రవిశంకర్

ప్రసిద్ధ సితార్ విద్వాంసుడు పండిట్ రవిశంకర్ గతవారం మద్రాసు వచ్చిన సందర్భం పురస్కరించుకొని ఇక్కడి సంగీత ప్రియుల కోరికపై చిన్న గానసభ చేశారు. సితార్ పేరు వచ్చినపుడు చెప్పుకునే మొదటి రెండు మూడు పేర్లలో రవిశంకర్, విలాయత్ ఖాంలవి వస్తాయి

సినిమా సంగీత దర్శకునిగా కూడా రవిశంకర్ పరిచితుడే. సత్యజిత్ రాయ్ చిత్రం 'పథేర్ పాంచాలీ', లో పథగోవతి చిత్ర గీతిని విశ్వసమ్మోహన కరంగా వేణువులో పూరించాడు రవిశంకర్. 'కాబూలీ వాలా' చిత్రానికి ఈయన నేపథ్య సంగీతవ్యాఖ్య బెర్లిన్ అంతర్జాతీయ ఉత్సవంలో బహుమతి పొందింది.

ద్వారం నాయుడుగారి వయొలిన్, శంకర శాస్త్రిగారి వీణ ఉత్తరాది దక్షిణాది పండితులను మెప్పించి పామరులను రంజింపజేసినట్లే, రవిశంకర్ చేతిలో సితార్ సర్వజన రంజకంగా పాడుతుంది. శాస్త్రీయమైన సంగీతాన్ని ఆధునిక శిల్పంలో మలచి మనోహరంగా వినిపించారాయన. సుమారు నాలుగు గంటల సేపు జరిగిన కచేరీలో రెండుమూడు రాగాలు ఆలాపించి, ఒక తుమ్రీ వాయించారు. (తబలా తరంగిణి ప్రఖ్యాత కృష్ణమూర్తి గారు తబలా వాయించారు.)

ఉదయశంకర్ ఇంటజరిగిన ఈ చిన్న గానసభకు ఈమని శంకరశాస్త్రి, రాజేశ్వరరావు, ఘంటసాల, పామర్తి, ఆచార్య పి. సాంబమూర్తి, మద్రాసు రేడియో డైరెక్టరు ఎస్. ఎన్. మూర్తి, డా॥ వి. రాఘవన్, రుక్మిణీదేవి, కమలా లక్ష్మణ్, హారీన్ చటోపాధ్యాయ, ఎ. వి. మెయ్యప్పన్ ప్రభృతులు వచ్చారు.

" సరస్వతీ అవతార్ " అన్నారు రాజేశ్వరరావు; రవిశంకర్‌ను ఆయన అన్న ఉదయశంకర్ దగ్గర మెచ్చుకుంటూ.

## వివాహాలు

జూన్ 9వ తేదీన మద్రాసులోని తెలుగు సినిమా తారల కారులు బారులు కట్టి తిరుపతివేపు సాగిపోయాయి. భానుమతి సావిత్రి, సూర్యకాంతం, (అంజలీదేవి హైదరాబాద్ వెళ్ళింది), నాగేశ్వరరావు, రంగారావు, (గుమ్మడి, రేలంగి హైదరాబాద్‌లో ఉన్నారు), ఆర్. నాగేశ్వరరావు ఆదినారాయణరావు, చక్రపాణి, ఎస్. ఎం. శ్రీరాములునాయుడు, వి. సుబ్బారావు ఉమ్మడి సుబ్బారావు, తాతినేని ప్రకాశరావు, యార్లగడ్డ వెంకన్న చౌదరి, వాసిరెడ్డి నారాయణరావు, ప్రతిభా శాస్త్రి, ఆనంద్, పెండ్యాల నాగేశ్వరరావు, వేదాంతం మొదలగువారంతా తరలి వెళ్ళినది అన్నపూర్ణా పిక్చర్స్ అధిపతి మధుసూదనరావు గారి కుమార్తెల వివాహాలకు. ప్రథమ పుత్రిక చి॥ సౌ॥ లలితకుమారిని శ్రీ జగదీశ్ చంద్రప్రసాద్‌కూ, ద్వితీయ పుత్రిక చి॥ కల్యాణిని చి॥ గంగాధరరావుకూ ఇచ్చి జూన్ 10న తిరుమలపై అత్యంత వైభవంగా ముహూర్తంలో వివాహ మహోత్సవాలు జరిపించారు. తెలుగు దేశమంతటినుండి చిన్నా పెద్దా దాదాపు వెయ్యిమంది అతిథులు వచ్చారు.

"మా పిక్చర్ లాగే వివాహాలు శాంతిగా జరిగాయి. సెట్ మీద ఏనాడూ కలుసుకోలేని పెద్ద ఆర్టిస్టులు ఇంతమందిని మళ్ళీ ఈ సందర్భంగా ఒకచోటికి తెచ్చారు" అన్నారు ఎస్. ఎం. ఎస్. నాయుడు నవ్వుతూ.

# మీ లోకజ్ఞానం మీరే పరీక్షించుకోండి.

## 6, 7 పేజీల్లో ప్రశ్నలకు సమాధానాలు

I సాహిత్యం : 1. నన్నయ, ఎర్రాప్రెగడ 2. మనుచరిత్రం 3. జేబుదొంగలు, ఏకవీర, శృంగారవీధి 4. పెద్దన 5. జోసెఫ్ కాన్రాడ్.

II భూగోళము : 1. మలయా 2. సెంట్ పీటర్స్‌బర్గ్, భాగ్యనగరం 3. సైబీరియా 4. పసిఫిక్ మహాసముద్రం 5. అంటార్కిటికా.

III సంగీతం : 1. త్యాగరాజు 2. పన్నాలాల్ ఘోష్ 3. అమెరికా 4. అమెరికా 5. శివుడు.

IV సైన్సు : 1. రూథర్ ఫోర్డు 2. కాలము 3. పాశ్చర్ 4. ఉదజని 5. వీలున్నది.

V రాజకీయాలు : 1. బాలగంగాధర తిలక్ 2. రాబర్ట్ ఓవెన్ 3. రష్యన్లు 4. కాస్ట్రో 5. కెయిరో.

VI మతం, వేదాంతం : 1. కపిలుడు 2 జపాను 3. సాయుములు 4. బైబిలు 5. కీర్క్‌గార్డ్.

VII సినిమాలు 1. భక్త ప్రహ్లాద 2. పథేర్ పాంచాలీ 3. కర్మ 4. పెద్దమనుషులు 5. ఐసెన్‌స్టీన్.

VIII చరిత్ర : 1. పైతాగరస్, కన్ఫ్యూషియస్, బుద్ధుడు 2. సెంట్ థామస్ 3. అరేబియా 4. మహమ్మద్ గజిని 5. రాజా రామ మోహనరాయ్.

IX శిల్పం, చిత్రకళ : 1. గాంధారశిల్పం 2 పల్లవులు 3. కాంబోడియా 4. అజంతా 5. దేవిప్రసాద్ రాయ్ చౌధురి.

X క్రీడారంగం . 1. హాకీ 2. రంజిత్ సింగ్ జీ 3. సంతోష్ ట్రోఫీ 4. బ్రెజిల్ 5. బ్రిటన్.

## మీ స్థాయి అంచనా

మీకు వచ్చిన మార్కులనుబట్టి లోకజ్ఞానంలో మీ స్థాయి ఎక్కడున్నదో ఈ క్రింది అంచనా సహాయంతో గ్రహించవచ్చు తెలుసుకోవచ్చు. ప్రతి సబ్జక్టులోనూ కనీసం ఒక ప్రశ్నకైనా సరైన సమాధానం ఇచ్చినవారు తమ మొత్తం మార్కులకు 5 మార్కులు కలుపుకోవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 15 మార్కులకు ఎక్కువవస్తే | | | —ఒక మోస్తరు |
| 20 | ,, | ,, | —ఫరవాలేదు. |
| 30 | ,, | ,, | —విశేషం |
| 40 | ,, | ,, | —ఉత్తమం. |

# రుద్రగళ్ల నుడికట్టు 6

## ఆధారాలు

డ్డం

...వి దైవాధీనములు.

...మందు తలపోయినప్పుడు ...కానే ఔషధం.

...క తెగిన మనిషి.

...ఎదుగుడు తుచ్ఛుల చిహ్నం.

...జానీ!

13. తల్లిదండ్రులు ప్రేక్షకులు కావచ్చు.

15. ఈ మధ్య ఇదివరకు పూర్తికాని ...పగలు.

...నవిని ఆలించు.

...రస్సుండగా ఈ పూజ పని ...స్తుంది.

...ప్రమాదం!

...వాలుక, బలి తెగించడంలో భక్తు...తాలు.

ఇదే సుమా! యతులు చెప్పే ...గానిలో మిథ్య!

...నకి దీనితో దూరం కాలు ...వి కాబోలు.



27. వాక్చాతుర్యము.

నిలువు

2. మాయా మందిరంలో ఒక ఝాము.
3. పీకాడుమాట పాటిమైథరశెల్లు.
4. కొందరికోసం నివసించే చోటు.
5. గ్రామములందు కొనకు రణములు సంభవించుట వీరివలన కానోపు.
7. ప్రభుత్వనినాదం. సత్యమే!
9. క్రిందటిరోజు.
11. అంతం.
14. "బావా చవితి నేలలో రుచి చూడడం."
16. చివర దబదబా వచ్చే పల్లవ.
18. రనితిరుగుబాటుచేస్తే ఏక— రాత్రి!
19. పాచికపాలు జాతరచేయుడంలో ఒక పువ్వు పూర్తిగా వికసించదు.
20. పూలమాలలో రెండు లతలు నష్టం!
24. ఆరాటములో స్తంభం.
26. ఆననములో పువ్వు.

...నుడికట్టుకు జవాబులు

...డ్డం: 1. గోడమీది పిల్లి ...ము. 6 నష్టి. 7 కాలమే. ...త. 9 సాగు. 11 మునిచరణం. ...వు 13 రోము 14 ఖాయి 16 మకా 17 నవకాయ ...ంటలు.

...లువు: 1 గోతికాడ నక్క ...న 2 మీనమేషములు. ...ష్టి 4 వాక 5 ముసుగులో గ్దులాటలు 8 జలచరము. 10 ...రం ఖాకాసం. 15 బాకా. మడి.



# పుస్తక సమీక్ష

## కథామంజరి

(ప్రతిమా బుక్స్ 49 మూకతాలలో ఒక ముద్రణ.)

దక్షిణభాషా పుస్తకసంస్థ సహకారంతో ప్రకటితము. వెల రు. 1.50 న. పై. లు. పేజీలు 186 (ప్రాప్తిస్థానము ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, మగన్ మహల్, రాష్ట్రపతి రోడ్, సికిందరాబాదు.)

పదికథలున్న పుస్తకం ఇది. ఒక కథ ఇంకో కథకు తీసిపోదు, అన్నీ రత్నాలే. చిక్కాలవారి 'ఏమి సంబరిగం?' లో తెలుగుతనం ఉట్టిపడుతున్నది. సామాన్య కుటుంబాలు, ఆ సంసారాల మెలకువలు చక్కగా కళ్ళకు కట్టేటట్టుగా రాశారు. బస్సీలో చదువుకొనే పిల్లల తెలివితక్కువతనం సీమ కురపకాయ తినడంలో బయటపెట్టారు. కథ చదివేవాళ్ళకు ఆనందం ఇచ్చేటట్టుగా వుంది. గుడిపాటివారి 'శేషమ్మ' కథను మొదలుపెడితే పూర్తి కానాలసిందే. తెలుగు తిట్లు, తెలుగు సంసారాల పోకడ గోచరమౌతవి. అమ్మలక్కల కబుర్లు మాట్లాడుకున్నట్టే చిత్రించారు. ఇళ్ళలో బంటచాకిరి చేస్తూవుండేవాళ్ళ మనస్తత్వాలు విపులంగా విశదీకరించారు. 'తిండి దొంగలు'లో కుటుంబరావుగారు మధ్య తరగతి కుటుంబాల శోభ బయటపెట్టారు. దారిద్ర్యం ఏవిధంగా ప్రత్యక్షమయ్యేది తెలుస్తుంది. డబ్బు వచ్చేటప్పటికి కళ్ళు పైకి పోతియ్యంటారు. అది ఇందులో తెలుస్తుంది. ఆత్మాభిమానంగల తల్లి శంకమ్మ డబ్బుతో విర్రవీగుతున్న కూతురు సుభద్రను అసహ్యించుకొని వెళ్ళిపోతుంది.

గోపీచంద్ గారి 'సత్యవడ్డీలో' పల్లెటూరి సంసారాల వ్యవహారం చక్కగా రూపొందించారు. అందులోవున్న సంభాషణలు సాక్షాత్తు మాట్లాడినట్టుగా మనకు అందచేశారు. సాహుకారంటాడు "అదేమిటి నారయ్యా! నిన్న గొట్టమేమిటి? మూడు దండాలు వేసుకోవటమేమిటి?" పల్లె గ్రామాల జీవితపద్ధతి దీనిలో తెలుస్తుంది. ఇక బుచ్చిబాబుగారి "నా మీద కథ వ్రాయవూ" అన్నదాన్లో నాయకుడు వేదాంతియూ, ఆత్మీయుడూ, అమాయక వ్యక్తియూ అనిపిస్తూ వుంటుంది. అతని సంగతి అతనికి తెలియదు. స్త్రీని గురించి భావవిచారణ బాగుంటుంది. సముద్రాన్ని ఏమి చిత్రిస్తారండీ! అరటిపండు తిన్నట్టుగా చదవవచ్చు ఆ పేరాగ్రాఫులు. బుచ్చిబాబుగారు పమిటజారటం వగైరా ఆకస్మిక దృశ్యాలను చక్కగా పద్యంలో గీసినట్టుగా సహజ సుందరంగా నడిపిస్తారు. బకెట్ లో నీళ్ళు తోడిపెట్టిన తరువాత సముద్రాన్ని గమ్మత్తుగా ఆనందంగా చూస్తారు.

సంకలనచేసిన మూర్తి చందూర్ గారిని అభినందించాల్సిందే.

"రాధ" ★




## కుంజర యూథము

రచన : జె. హెచ్. [illegible]
అనువాదం : బులుసు వెంకటరమణ[illegible]
ముద్రణ : శివాజీ ప్రెస్, సికిం[illegible]
బాదు. 164 పేజీలు : వెల 1[illegible]
(దక్షిణ భాషాపుస్తకసంస్థ సహ[illegible]
ప్రకటితము) దొరకుచోటు: ఆంధ్ర
బుక్ డిస్ట్రిబ్యూటర్సు సికింద్రాబాదు

లెఫ్టినెంట్ కర్నల్ జె. [illegible] యమ్స్ డి. బి. ఇ, అనే ఆయన పాతికేళ్ళపాటు ఒక టేకు కార్ఖానా సంస్థలో పని చేశాడు. ఆ పాతికేళ్ళూ ఏనుగులతో సంచరించవలసి వచ్చినది. ఏనుగుల స్వభావాలన్నీ, గుణగణాలనూ బాగా ఆకళింపు చేసుకున్నాడు. పాతికేళ్ళ అనుభూతిని వివరిస్తూ ముఖ్యంగా "ఏనుగుల జీవితం" గురించి, చేస్తూ "ఎలిఫెంట్ బిల్" అనే పుస్తకం రాశాడు. ఇందులో బర్మాలో ఏనుగుల జీవితం ఎట్లావుంటుందో ఆయన వివరించాడు.

అక్కడి [illegible] పరిశ్రమకు ఈ సహకారమే లేకపోతే పరిశ్రమే వు[illegible] విషయం మనకు ఈ పుస్తకంవల్ల తెలు[illegible]

మనుష్యుల జీవితాల్లాగే మృగాలకి కూడా చాలా చిత్రమైనవి. వీటిల్లో జీవితం మరీ చిత్రంగావుంటుంది. ఏ[illegible] ఆ అరణ్యంలో ఎట్లా పెరుగుతాయి? జీవిస్తాయి? వాటిని మనుష్యులు ఎట్లా దీసుకుని పన్లు చేయించుకుంటారు? అనేక సందేహాలకు సమాధానాలు, వాటి స్వభావాలూ, ప్రణయమూ, తెలివితేటలూ, వ్యూహాలూ, [illegible] మొదలైన ఎన్నో విషయాలను [illegible]కంలో మనం తెలుసుకోవచ్చును. ఒక్కడ తమాషావైన కథలుకూడా కొన్ని ఛాయాచిత్రాలూ వున్నై.

మానవజీవితాలను క్షుణ్ణంగా చేసుకున్న వారు జంతువుల జీవితా[illegible] తెలుసుకోవాలని వాంఛిస్తూ వుం[illegible] అందులో "ఏనుగు" గురించి తెలు[illegible]లనుకునేవాళ్ళకు ఈ పుస్తకం [illegible] అసలు పుస్తకాన్ని సంగ్రహించి తెలుగుఅనువాదం సరళంగా వ్రాసినా[illegible] కనుక సరిపోతుంది; లేకపోతే తెలు[illegible]దిగిన ఈ "కుంజర యూథం" [illegible] మాటంగా మనకు తుక పట్టేది!

'అ[illegible]

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna [illegible]
The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad

